# స్త్రీ త్యాగము

అను

## నవరసభరిత సాంఘికనాటకము

రచయిత్రి:

**ఎం. ఏ. కాంచన్**




పబ్లిషర్సు:

**కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు**

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.




[[illegible]

# హెచ్చరిక

ఈ "స్త్రీ త్యాగం" నాటకముయొక్క కాపీరైటు సర్వహక్కులు మాకు చెందియున్నవి. కావున మా వ్రాత పూర్వకమైన పర్మిషను లేనిదే యే సంఘముగాని యే సినీమా నటులుగాని ప్రదర్శింపరాదు, మరియు టాకీస్క్రీనింగు, గ్రామఫోను రికార్డింగు, యితర భాషలలోనికి తర్జుమాలు వగైరాలు చేయకూడదు. అట్లు అతిక్రమించిన వారలు మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని యిందుమూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు కాపీరైటు హక్కుదారులు,

రాజమండ్రి } కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్
8-5-1947 } శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి.



రచయిత

శ్రీమతి యమ్. ఏ. కాందన్

# పీఠిక

కొన్ని సంవత్సరములకుఁ బూర్వమువరకు నేను నాటకములలో ప్రధానస్త్రీపాత్రలను ధరించుచుండెడిదానను. ఆరోజులలో శ్రీకోప వేంకటరమణరావుగారి 'ఓన్లీ డాటర్—భాగ్యరేఖల' లోఁగూడ సుఁ రమ్మ, మీనాక్షులుగా నటించు నదవకాశము నాకు చేకూరినది. ఏ దైవసంకల్పముననో, ఈనాటకములలోఁ బ్రధానస్త్రీపాత్రల ధరిం నది మొదలు నాకుఁ గొద్దిగా పేరు రా మొదలిడినది. ఇంతలోఁ గా ణాంతరములవలన నాటకము లలోఁ బాల్గొనుట విరమించుకొంటిని. విరమించుకొనుట యొకవిధముగా నాకు మేలుఁ గలుగఁజేసినది. కళాదేవిపాదపద్మసేవ లభింపకపోయెకదా యని యించుక మనము ఖేదముఁ గలుగక పోలేదు. తత్ఫలితముగా, నంతగా వ్రాయుటలో ప్రవేశము లేకున్నను, నేదైన చక్కనినాటకము నేనును, వ్రాయ వలయు ననుకుతూహలము గల్గుచుండెడిది. ఇట్టియుద్దేశముతోడ యీనాటకము వ్రాయుటకుఁ బూనుకొంటిని. ఇందలి, కథావచ భాగమంతయుఁ గేవలము నేను వ్రాసినదే!

పాటలుఁ బద్యములుమాత్రము శ్రీ కోవల్లి వేంకట రమణ రావుగారు దయతో వ్రాసియిచ్చిరి. ఈశ్వరేచ్ఛయుఁ బెద్దలయాశీర చనభాగ్యము నుండునేని ముందు వ్రాయఁబోవు నాటకములలో నే స్వయముగఁ బద్యము లుఁ బా..లుఁగూడ వ్రాయనాసించుచున్నాను అందులకు దగిన కృషి చే..చున్నాను. ఇది నాప్రథమప్రయత్నము గానఁ బండితు లిందుఁగల నెరసులకు నన్ను మన్నింతురుగాక!

పితృవాత్సల్యముతో సర్వదా నామేలుఁ గోరుచు నానాట మును సరిచేసి రంగస్థలముపైఁ బ్రదర్శనమునకుఁగూడ తగిన యేరా టులఁ జేసిన శ్రీ కోవల్లి వేంకట రమణరావుగారికి నామనఃపూర్వ కాభివందనములు.

"ఎం. ఏ. కాంచన్"

# అంకితము

నా

స్త్రీత్యాగమును నాయభిమాన

దేవతలగు

పార్వతీపరమేశ్వరులకు

భక్తిపూర్వకముగా

నంకితము చేయుచున్నాను

'ఎం.వి. కాంచన'

# ఇందు వచ్చుపాత్రలు



## పురుషులు:

గౌరీపతి:—కథానాయకుఁడు

గణపతి:—గౌరీపతి మేనమామ

గిరిజావధాని:—"ఉమ" తండ్రి

తిమ్మయ్య:—సోదెమ్మగారి పుత్రుఁడు

అవతారం:—సీతమ్మగారి పెంపుడుకొడుకు

భీమశంకరశాస్త్రి:—అన్నపూర్ణ అన్నగారు (సుందరితండ్రి)

ఆఫీసరు:—తిమ్మయ్య పై యధికారి

## స్త్రీలు:

అన్నపూర్ణ:—గణపతిగారికూఁతురు (కథానాయకురాలు)

ఉమ:—గిరిజావధానిగారి కూఁతురు (ఉపకథానాయకురాలు)

సీతమ్మ:—గణపతిగారి భార్య

సుందరి:—భీమశంకరశాస్త్రిగారి కూఁతురు

సోదెమ్మ:—తిమ్మయ్య తల్లి

•

ఓం

నమశ్శివాయనమః

# స్త్రీత్యాగము

## ప్రథమాంకము

### మొదటిరంగము

ప్రదేశము : ఉద్యానవనము.

ప్రవేశము : గౌరీపతి

గౌ: (గణపతిగారితోఁటలో గౌరీపతి మొక్కలకు నీళ్లు పోయుచుఁ బాడుచుండును.)

గౌ: ఓ! పుష్పారామము! నీవె!
నా! స్వేచ్ఛాధామము! గావా ॥ఓ॥
పరమ! శాంతిని! ప్రకృతిరమలో!
విరులు! గురియును! చాలా!
సుమా! కాంతతో! హృదయ! విదారీ!
కామార్థి! మెలఁదేఁటి ॥ఓ॥
సతతము! సతీ! పతీ
కారా! జగతి! బంధాల్!
పతి! పతీకగు! స్వేచ్ఛా! గృహము!
నీవేకదా! విరికాంతా!
నీలాంబరీ!

అ॥ ప్రేమ| మహా| నది| ప్రాణాధారా|
ప్రేమ| వాహిని| పయనము|సేయా|
ప్రియుండే| నావ| విధాతా ॥ఓ॥

పరివేశము : అన్నపూర్ణ

అ: (తానును బాడుచు అన్నపూర్ణ పరివేశించును)

గా: అన్నపూర్ణా! అంత కంగారుగా వచ్చావేం!! అత్తయ్య నన్ను పిలువ మన్నదా?

అ: లేదు బావా! నీవు మొక్కలకు నీళ్ళు పోస్తున్నావుగదా అని, నీకు సాహాయ్యము చేద్దామని వచ్చాను. ఏదీ ఆవాటర్ కేన్ యిలా యియ్యి; నేనూ పోస్తాను. (అని ఆ కేన్ తీసుకుని నీళ్ళు మొక్కలకుం బోయుచుండును.)

గా: అబ్బా! నే నంటే నీ కెంత దయ? నీ కెందు కాశ్రమ? నేను పోస్తానులే!

అ: కేవలము దయకాదు బావా, ఇంకొకటి!

గా: (దగ్గరగా వచ్చి) ఏమి టది చెప్పవా?

అ: నీవు చెప్పుకో లేవా!

గా: చెప్పుకో లేను - నీవు చెప్పుము!

అ: చెప్పనా?

గా: చెప్పు మరి!

అ: చెప్పినందువలన లాభ మేమిటి?

గా: అది, నీవే చెప్పుదువు గాని!

అ: చెప్పిన తర్వాత?

గా: ఆలోచించుదువుగాని!

అ: బాగున్నాయి బావా నీమాటలు! (అని కొంచెము దగ్గరగా వచ్చును) అన్నీ విని పట్టిచెయ్యి చూపుతావా?
గా: ఎంతమాట! నీమాటల కెదురు చెప్పగలనా? చెప్పను అన్నపూర్ణా?
అ: అలాగైతే చెప్తాను విను బావా - నిన్ను నేను ప్రేమించుచు న్నానని తెలుసునా నీకు? (అని సిగ్గుపడును.)
గా: తెలిసినందువలన లాభము కలదా? (అని తల క్రిందికి వంచు కొనును.)
అ: పెళ్ళి చేసుకొందాము!
గా: (విచారముతో) అది కలలోని వార్త! నిన్ను నా కిచ్చి వివాహము చేయుట ఈజన్మలో అత్తయ్య జరుగనీయదు. నన్ను, యింట్లోనుండి వెళ్ళకొట్టాలని, అత్తయ్య అన్నిప్రయత్నములు చేయుచున్నది!
అ: బావా! నిన్నుతప్ప యింకొకరిని ప్రేమించలేను. నీకుఁ దెలియకుండానే, నాప్రేమను నీ కేనాఁడో అర్పించుకొన్నాను. నీవుకూడా, నన్నలా ప్రేమిస్తున్నావని నమ్ముచున్నాను. నేను సుందరముగ లేనా? నిన్నుఁ బ్రేమింపఁదగనా?
గా: ఉ. సుందరియైనమాత్రమునఁ- జూచి వరించి శరీరసౌఖ్యముల్ బొందగఁ జూచు మానవుఁడు మూర్ఖుఁడనంగను జెల్లు; నేమనన్ అందని మ్రానిపండ్లకయి యత్నులు సాచుట నేమి లాభమో ఇందుముఖీ! గ్రహింపువచి-యింతుయథార్థముదాఁపకుండగన్.
నేను నిర్భాగ్యుఁడను! ధనవిహీనుఁడను!! (అని విచారించు చుండగా)
అ:—బావా! నాకుఁ గావలసినది ధనము కాదు! నీవు!! అమ్మా, నాన్నతోనేను గట్టిగా వాదించెదను. వారు వినకపోతే మనమిద్దరము కలసి యెక్కడికో వెళ్ళిపోదాము. ఆకులో, అలములో, దిని బ్ర

దుకుదాము. ఎ రు పోసినవా(డు నీరు పోయక మానునా? అదీ, కాక, నీవు కొద్దో గొప్పో చదువుకున్నావు. ఏయుద్యోగమైనా దొరకక పోవునా? ఆపైని యీశ్వరుఁడే యున్నాఁడు!

గా:—న న్నెంత చెడ్డగాఁ జెప్పుకుంటారు నిన్ను ద్రోహము చేసానని! సంఘము మనల నెంత చులకనగాఁ జూస్తుందో తెలుసునా?

అ:— తెలుసును. సంఘ మన్నమాట చెపితే నాకుఁ గోపం!- బావా, సంఘములో జరిగే విషయాలు చూఁడు! కొంతధనముతోనహా, ఆఁడుపిల్ల, నప్పచెప్పాలంఁట! ఆపిల్ల కాఁపురు డు నచ్చినా, నచ్చక పోయినా, డబ్బులో డబ్బు కలవాలంఁట!!. ఒక డబ్బులేని వరున కెన్ని మంచిగుణా లున్నానరే, యతఁడు సంఘముదృష్టిలోఁ గన బడనే కనఁబడఁడు. ఎంత మంచిసంఘము మనది! అంతవరకు వస్తే సంఘాన్ని మనమే దూరము చేద్దాము!

సీ. కట్నము లేకుండఁ- కన్యలఁ బెండ్లాడఁ
దలవంపువని యెంచి- తలఁచువారు,
కాసికోర్కెలఁ గోరి- కాఁతలయుక్కురఁ
దీర్చక వేపుకుఁ- దినెడివారు,
సారె యిచ్చిరె? వట్టి- సన్యాశియత్తవా
రని భార్యపై నెప్పు- డలుగువారు,
పుట్టింటి కేఁగినఁ- బోవు మాగౌరవ
మత్తింటి నుండని-యదరువారు,

తే॥ గీ॥ సంఘ ముద్ధరించెకువారు- చాలు! వీరె?
సంఘమనుపేర వీరలు- సల్పు నీచ
కార్యముల్ సహించియుంచి సంఘాలు మెలఁగ
విడువ మే లట్టిసంఘాలు విధిగ బావ!

గా: అయ్యో పూర్ణా! నీమీద నాకు నిశ్చయమైన ప్రేమ యున్నది. కాని, యది తీరనికోరికగా నెంచి, నాలో పుట్టిన కోరికను నాలోనే యంతరింపఁ జేసుకొనుచున్నాను. ఇప్పుడు నీమధురమైన పలుకులవలన, నాయొక్క నంకురించిన యాశలు మరలఁ జిగిర్చి పూవులుఁ బూయునేమోయని మరల మరియొక క్రొత్తఆశ కలుగుచున్నది.

అ: పూవులు పూయుటయే కాదు. కాయలుఁగూడ కాచి, పండ్లు పండగలవు.

గా: అబ్బా! ఎంత తియ్యనిమాటలు? నాజీవితము నిరర్థక మనుకున్నాను!

అ: ఎప్పుడట్లనుకొనవలదు. ఏలనన, నిరాశలోనే సుఖ మున్నది! ఇంక నీవు నిర్భయముగా నుండవచ్చును. సమయముకొరకు శంకరుని ప్రార్థించెదము.

గా: కొంచ మాలోచించి) అవునుకాని, యన్నపూర్ణా! ప్రస్తుతము మనఃఖద్ధ్యులకు ధన మవసరముకదా!

అ: ఆభారము నామీఁద విడిచిపెట్టుము. నాదగ్గర చిన్న చిన్న వస్తువులున్నవి. అవిచాలుఁ గొన్నాళ్ళవరకు మనపొట్ట గడుమటకు! మరి వెళ్లనా, బావా? అమ్మపిలుస్తుం దేమో!

గా: వెళ్లు, చాలాసేపయింది, కాని నన్ను వెలుఁగులోనికిఁ దెచ్చితివి. ధన్యుడను.

ప్రేమాద్రి। శిఖరంబె।శుభాంగీ॥
కాంచితి। కనుగవతో।ప్రేమాద్రి॥
నీమూర్తి। కనంగా। ప్రమదముగాదా।
లతాంగీ।
త్వదీయస్పర్శ। సదా॥ప్రేమాద్రి॥
మధుఫలము। రసాలంబే।

మధుఫలమే ।

మధుఫ-మే । నాజీవి ।

మధురమే ।శుభాంగి । పరిణయఫలం ।పాణినికీ । శుభోదయమే

శుభగాత్రి ।ఓ। ॥ప్రేమాది॥

శుభగాత్రి ।ఓ। కనకలతా

మదిలో।

హృదిలో। కమలాక్షి। వెలిఁగెడు। జ్యోతి।

ప్రేమకాంతి । చేతన్।

కల్యాణి।

కామార్ధివి। నీవె। ప్రేమనిధీ।

ఇహపరములా ।

ఇహపరములా। అని। మది। నెంతుగదే।

కలవాణి। కాంతును। కనకగిరి।అలివేణిరో।మేటి। శిఖ॥ప్రేమాద్రి।

---

## రెండవరంగము

(గణపతిగారిగృహము-గణపతిగారు, వారిభార్య సీతమ్మగారు కూర్చుని యుండగాఁ దెర లేచును.)

సీ: అమ్మాయిపెళ్ళిమాట మీరె త్తనే యెత్తరు. ఎలాగంటే అలా, పూరకుంటే? సంబంధాలుమనకాళ్ళకడకు వస్తాయా?ఆఁడుదాన్ని నే నేమి చేయగలను? మగవారి కుండాలి యీతొందర! లేకలేక పుట్టినది యీ ఆఁడుపిల్ల! మీరే, యుశ్రద్ధ చేస్తే యెలాగా? చక్కనివరునిఁ చూచి మనయమ్మాయికిఁ బెళ్ళి చేస్తే మనబాధత్య వదలుతుంది!

(: (భార్యవైపుకుఁ దిరిగి) అదేమిటే! ఇంట్లో నల్లుని పెట్టుకుని యెక్కడో వెదకుట యేమిటి! మనగారిపతికంటె యందమైనవాఁడు, చురుకైనవాఁడు, తెలివైనవాఁడు, నెమ్మదియైనవాఁ డుంటాడా? అదికాక మనయన్నపూర్ణకు వాఁ డంటే యెంతో ప్రేమ! చాలా సౌందర్యంగా నుంటాఁడని!!

ౕ: (కళ్లెఱ్ఱఁజేసి) చా లూరుకోండి!

సీ. సౌందర్య ముండిన-సార్థక మేమి? సౌం
దర్య మన్న మిడునె-దంపతులకు?
కూడుగుడ్డలు లేని-గుణవంతునికిఁగూఁడఁ
దమపిల్ల నిచ్చుట-ధర్మ మెక్కో?
స్థిరచరాస్థులు లేని-చీడసంబంధము
కనఁబడు చుండెనా-కండ్ల కెపుడు?
లక్ష్మి వరింపదు-లాతివారల, సర
స్వతి వరించు దరిద్రు-జగతి నెందు!
తే. గీ. అతని కీయవలదు ప్రియ-సుతను మీరు!
ఎట్టిగా బుట్టగా నుండి-యెంతొ యాస్థి
యుండి, కారుండి, పెద్దయు-ద్యోగముండి,
వెలయు నల్లుఁడు రావలె-వేగ మనకు!!

ఇంకఁ గట్టిపెట్టండి మీయుపన్యాసము. అన్నీయున్నవి, అయి నతతనము లే దన్నట్లున్నది, ఏమియుంటే యెందుకు? దరిద్రగొట్టు-లోకలోక పుట్టిన ఆఁడుపిల్లను, వాని కిచ్చి- ఆపిల్లగొంతుక కోయఁదలఁచారా? (అని యేడ్చును)

సః పిచ్చిదానా! దరిద్రి మెల్లకాల ముండి కాపురము చేయుదు. చీఁకటితరువాత వెన్నెల రాకమానదు. అదీకాక, వాని కేమి

చదువు లేదా? తెలివి లేదా? ఏది యేలా యున్నా, నాచెల్లె లాఖరి కోరికగాఁ జెప్పిపోయేటప్పుడు, "అన్నపూర్ణను, గౌరీపతి కిచ్చి పెళ్ళి చేయవలసినది" అన్నది. తప్పుతుందా మరి? వాఁడై నా మనము గీచిన గీటు దాఁటడు- మంచివాఁడు!!

సీ: అందే వరకూ అలాగే యుంటారు. దొంగకూడా పెద్దమనిషి లాగనే యుంటాడు- తనదొంగతనము బైటపడేవరకును!

గ: వాఁడేమన్నా దొంగతనము చేసేఁడా?

సీ: ఎందుకు లెండి, చెప్పడము! మనమే యల్లరి పెట్టుకుంటే పై వాళ్ళు మరీయల్లరి పెట్టారని మీతోనైనా చెప్పకుండాఁ గడుపులోఁ బెట్టుకున్నాను. నానాఁటికి ఆలబ్బాయివని యాగడ మయిపోవు చున్నది- ఏగూట్లో డబ్బు లాగూట్లోనే మాయమయి పోవు చున్నవి. ఏమి చెప్పుకోను? ఈ సంసారం సంగతి యీలా గున్నది!

గ: నీమాటలు నిజమే నటే!

సీ: అయితే, (దౌడలు నొక్కుకొనుచు) నే నబద్ధము చెప్పానన్నమా టకి నా కెందుకు? తెచ్చుకొనేవారు మీరు! ముందు చిన్నదొంగ తనాలు తరువాత పెద్దదొంగతనాలు మొదలుపెట్టే మీకే తెల స్తుంది. ఇప్పుడు నేజెప్పినమాటలు చెవికి సోకవు!

గ: (లేచి) అమ్మభడవా! నీవంగ తెంతవరకూ వచ్చినదా? ఇంక వీడు మనింట్లో యుక్కునిమిష ముండటానికి వీలులేదు. ఏఁడీ, ఆడు ర్మార్గు డెక్కడున్నాఁడు? (అనుచుండగా నింతలో నన్నపూర్ణ పా డుచు ప్రవేశించును.)

అ: నాన్నా! న న్నీవేళ, సినీమాకుఁ దీసికొని వెళతానని మొన్న చెప్పినావుగదా! తప్పక తీసుకొని వెళ్ళాలీవేళ— లేకపోతే అన్నఁ తినను!

ర: పోనిద్దూ! ఏమి సినీమాలు సినీమాలు చూడడము చాలా నీచ
మమ్మాయి!

సీ. గోడలు దాటుట మేడలు దూరుట
నింటికప్పులపైని నెగురుచుంట
కంటికి మనుగులు నింటికిఁ గన్నాలుఁ
దుంటరితనమునఁ దోఁగుచుంట
ఒకరిపెండ్లాము నింకొకరు ప్రేమించుచు
నుచ్చనీచము లేక నొప్పుచుంట
ఒకచెంప పయ్యెద నొయ్యారముగ జార్చి
తలుకుఁజూపుచు స్త్రీలు మెలఁగుచుంట

గీ. వెలయు నవె నేఁడు సినిమాల ప్రియతనూజ
చూడఁగూడదు తల్లికి శోక మెందు
వందుఁ బెండ్లికానట్టి లతాంగు లసలు
కన వినం గూడదఁట వానికథలు గిథలు!

: నాన్నా! అలా కాదు. నేను జెప్పేదికూడ వినుము.

సీ. కాంచనమాలయుఁ గన్నాంబ నటియించి
రాణ కెక్కిన "గృహలక్ష్మి" చూడు!
భానుమతీ పుష్ప వల్లుల నటనామ
హాత్మ్యము "వరవిక్రయము" న జూడు!
వరలక్ష్మి సూర్యకుమారులుఁ బాల్గొన్న
"రైతుబిడ్డ"లో వారిఖ్యాతి జూడు!
రక్తిశ్రీరంజనీ రామతిలకమ్ములఁ
గలపి తీసిన "సతీతులసిఁ" జూడు!

గీ శాంతఆప్టె, దుర్గాకోటి, శాంతలుండి
సొగసుగూర్చు చిత్ర "మమరజ్యోతి" జూడు!
విశ్వమానవసూక్తిన విరళకీర్తి
నెగడి పొగడొందు సినిమాలు నీచ మగునె?

సీ: ఇదీ దీనివరుస! వాడు, ఆడమంటే ఆడుతుంది పాడమంటేపాడు తుంది. ఇలాటివన్నీ చెప్పి దీనిని పాడుచేస్తున్నాడు వాడు!

అ: బా వేమి చెప్పాడమ్మా? అతన్ని అలా అంటావు? నాన్న మొన్న తీసుకొని వెళ్తానన్నాడు. అవునో కాదో నాన్న నడుగు- బా మీాదెప్పుడూ లేనిపోని మాట లలా పుట్టిస్తా వెందుకే, అమ్మా బా వింట్లో ఉండడము నీకనలు, ఇష్టము లేనట్లు కనబడుతోంది!

సీ: (కూతురుమీాద కండ్లెఱ్ఱజేసి) నీ తెలివితేటలకు చాలా సంతో షించినాము లే, ఊరుకో! ఆపోకిరీవానిని గురించి నిన్ను,ఎవరూ వూనుకొని రమ్మని పిలువలేదు. సిఫార్సు చేయ నక్కరలేదు.

అ: సిఫార్సు చేయడము లేదమ్మా! మంచి, మంచిగాను, చెడ్డ, చెడ్డ గాను ఎవరైనా ఎక్కడైనా చెప్పుకుంటారు! అదీకాక, బావ మన యింట్లో నౌకరీవానిలాగ కష్టపడుచున్నాడు. పనిమనిషి యవస రము లేకుండా, అన్నిపనులున్నూ తానే చక్కపెడుతున్నాడు! మన మేవని చెప్పినా వినుగు అనేది లేకుండా, చేస్తాడు. కొనక్క మనము కూరగాయలుగూడా కొనుక్కోకుండా, మనపెరటిలో నవన్నీ కాపించుచున్నాడు. అంతమంచివాని నలాగ అనడానికి నీకు నోరు ఎలాగ వస్తుందమ్మా?

సీ: "పిట్ట చిన్నది కూత ఘనము" దీనిమాటలు వినండి. ఎలా చెప్పి పెట్టున్నాడో వాడు దీనికి. గుర్రిడ్డు వెళ్ళి పిల్లను వెక్కిరించి నదంట వెనక!

గ: అవునుగాని, తల్లీ, యింతసేపెక్కడకు వెళ్ళావే?

అ: పెరట్లో, పాదులకు, బావా నేనూ నీళ్ళు పోస్తున్నాము నాన్నా! పాదు లెంత బాగా పెంచుతున్నాఁ డనుకొన్నావు బావ!

సీ: (కోపముతో భర్తను జూచి) వినండి దానికర్మము ఎలా కాల్తున్నదో! అల్లారుముద్దుగా మనము పెంచుకుంటూంటే, పాదులకు నీళ్ళు పోస్తూన్నదఁట యిది! అయ్యో అయ్యో! (అని బుగ్గలు నొక్కుకొనును)

అ: ఆఁ! బావకర్మమే కాలినపుడు నాకర్మము గాలిన తప్పు వచ్చినదా? అతను అమ్మకడుపున బుట్టలేదా? అతనితలిదండ్రులు జీవించి యుంటే యతని నెంత గారాబముగాఁ జూచుకొందురో కదా! ఎవరికడుపువంట వారికి తీపి!

గ: అమ్మా అన్నపూర్ణా! ఇటు వినుము. మీయమ్మమాటలకుఁ జాల పెంకెసమాధానములు చెప్పుచున్నావు! ఆతుంటరి యింట్లో చేరినవాఁడు చేరినట్లుండక దుర్మార్గపుపనులు, దుర్మార్గపుచేష్టలు చేయుచున్నాఁడు! ఇఁకటినుండి వాఁడితో నీవు మాటాడకూడదు! వాని నింట్లోనుండి యిప్పుడే తరిమేస్తాను! వాఁ డింట్లోవుంటే నీకు వచ్చేసంబంధాలుకూడా రావు!

అ: (తండ్రివైపు దీనంగా జూచి) నాన్నా! సంబంధాలు రావడ మెందుకు బావ ఉన్నాఁడుగా! బావనుమనసార ప్రేమించాను! ఆప్రేమను భంగము చేయకండి! మమ్ములను విడదీయకండి! బావను నాకళ్లెదుట నుండనీయండి. నాకానందముఁ గూర్చనీయండి!

సీ: ఇంక కట్టిపెట్టు నీధోరణి! ప్రేమ- ప్రేమ- ప్రేమలోనుంచి బూడిద, బుగ్గి!!

గ: (భార్యవైపుఁ జూచి) ఈకనుగాయకు అప్పుడే ప్రేమరుచికూడ తెలిసింది. నీవు జెప్పినమాటలన్నీ నిజమేనే! అన్నీ మనపిల్లకి చెప్పి

పెట్టి బంగారములాంటిపిల్లను పాడుచేయుచున్నాఁడు! వీఁ డొకస్ని
మువ ముండడానికి వీలులేదు మనింట్లో. ఏడీ యెక్కడున్నాఁడు,
ఒకసారి పిలుచుకొనిరా!

అ: (తండ్రిచేయి పట్టుకొని) నాన్నా! బావను నీవుకూడా నిందించకు!
నేను వినలేను. బావ అమ్మకు దూరపువాఁడైతే నీకుగూడానా?
అతను, నీచెల్లెలికొడుకు కాదూ? ప్రేమ బూడిద బుగ్గి అంటుంది
అమ్మ! బావను ప్రేమిస్తే బూడిద బుగ్గియును, అమ్మకు నచ్చిన
వానినిఁ బ్రేమిస్తే వెండి, బంగారమునా? మనమందరము నెప్పు
డో యొకప్పుడు బూడిద, బుగ్గియు నవవలసినవారమేఁ నన్ను
మీరు ఒకశ్రీమంతున కిస్తారనుకోండి— కర్మవశాత్తు అతఁడు
తనశ్రీనిఁ గోల్పోయి బీదవాఁడు కాకూడదూ? కలిమిలేములుఁ
గావడికుండలుఁగావా? పెద్దలు చెప్పినమాటలు ఎప్పటికినీ, వట్టివి
కావు-బావ చదువుకున్నాఁడు. ఇంటర్! ఏయుద్యోగమైనా దొర
కకపోదు! దానికితోడు మనడబ్బు ఉండనే యుందికదా!

సీ: నీ వెన్ని చెప్పినావశే, ఆముష్టిపానికి నిన్నీయను (అని యటు
వైపుఁ జూచి) గౌరీపతీ (యనిపిలచును)

గౌ: (కంగారుపడుచు) ఆఁ! వస్తూన్నా నత్తయ్యా! (అని వచ్చును)

గ: (గౌరీపతివైపుఁ గోపముగాఁ జూచి) నిన్నిన్నాళ్ళు భరించాము.
ఇంక భరించలేము. నిన్ను ఎల్లకాలము కూర్చొపెట్టి పోషించుతా
మని వ్రాసి యిచ్చినామా? వెళ్ళింక! నీదారి నీవు చూచుకో!

గౌ:(విచారముతో) మామయ్యా! నే నేమి యపరాధము చేశాను!
మీరుతక్క నా కీలోకములో నింకెవ రున్నారు దిక్కు? నావ
లనఁ దప్పులుంటే శిక్షించండి సంతోషముగా ననుభవించుతాను.
న న్నింతగా పెంచారు; చదువు చెప్పించారు: మీ యాదరణవ

లన నాతలిదండ్రులు లేనిలోటు మఱచిపోయాను. నే నివ్వు డెక్క-
డికిఁ బోగలను మామయ్యా! నిరాధారముగా నున్నాను!!
ఏమో, ఎక్కడకుఁ బోతావో ఎవరికిఁ గావాలి? ఎంతమాత్రము
మే మింక భరించలేము నిన్ను—
నాన్నా! మనము కాకపోతే బావను భరించేవా రెవరు? ఇంతకూ
బావ భరించలేనిపని లేమి చేస్తూన్నాఁడు నాన్నా, నాకుఁ దెలి
యక యడుగుతాను!
: (అన్నపూర్ణవైఁపు జూచి) నిజమే! అన్నపూర్ణ!! తలిదండ్రులు
భరింపవలసిన నన్ను అత్తయ్య మామయ్య భరిస్తున్నారు. వారు
న న్నేమనడానికైనా సర్వస్వతంత్రులు!
వారు నీ కూరికే అన్నముఁ బెట్టడము లేదు. ఇంటెఁడుచాకిరీ
చేయుచున్నావుగనుక పెడుతున్నారు. ఇందులో వారు చేసిన
త్యాగ మే మున్నది?
: అలా గనవలదు. అన్నపూర్ణా! మనయింటిపనులు మనముఁగాక
వారు చేయుదురా?
(కండ్లెఱ్ఱఁజేసి) చూశారా! వాడిబహువచనప్రయోగాలుఁ మనదీ-
మనదీ, "అంటున్నాఁడు పదేపదే! ఇంకాఁ గొన్నాళ్ళు పోతే
మనలను బైటకుకూడా విడల నంపడానికి వెనుదీయఁడు!
: నీమాటలు ముదిరిపోతున్నాయి నానాఁటికి! అబ్బాయి, అంతా
నవ్యముగా నున్నప్పుడే వెళ్ళిపో లేకపోతే చాలా విచారపడవలసి
వస్తుంది ముందుముందు!
: నేను వెళ్ళిపోవడము తప్పదా మామయ్యా?
: తప్పదనే చెప్పేది! ముమ్మాటికిఁ దప్పదు. ముందు బైటకు వెళ్ళు!
: బావ వెళ్ళిపోవడాని కెంతమాత్రము వల్లకాదు. బావను విడిచి
నేను బ్రతుకలేను! బావను మనసారా ప్రేమించాను! ఎన్నినాళ్ళ

ఆశలు పెట్టుకున్నాను. అవి యంతరింపఁ జేయకండి. మీకు బుణ్య
ముంటుంది.

సీ: నీగడుసుకబుర్లు మాని లోపలకు నడు ముందు! (భర్తవైపు
జూచి) ఇంకా చూస్తారే! వాణ్ణిబయటకు గెంటెయ్యక! చూచా
రా! ఎంతవరకు ముదిరిపోయాఁడో! "ఇసింటా రమ్మంటే యిల్లం
తానాదే అనేరకము" వీఁడిది! దీనికి వళ్లు చియ్యావట్టింది—వలపు-
వలపు- వచ్చిపడిపోయింది.

అ: అమ్మా! ఇటు వినుము!!

సీ. వఁ పుజ్యోతితో జీవి వెలుఁగొందు తమసాంధ
పటలిఁ బావు నిఖల ప్రాణులకును
వలపుఘుటికతో నఖలరోగముల్ సువ్వుఁ
దు్రళ్ళినరీతినిఁ దు్రళ్ళి పోవు.
వలపుటోడతో నేడు వారాశులున్ దాఁట
తఁ వమాను గుజ్జప్రు దాడుగతిని
వలపునిశితకర వాలంబుతో శత్రు
వర్గముఁ దునుమాడ వచ్చు నెంతో

తే. గీ. వలపులో, వసంతఋతువుఁ జెలఁగు వలపు,
గొలనులోఁ దామరల్ కోట్ల గొలఁది వెలయు,
వలపురాత్రి వెన్నెలకాంతి ప్రబలి నిలుపు
ప్రాణికోటుల భూమిపై రాణఁ జెలగ!

బావను గెంటెయ్యకండి! మాజంటఁ బావకండి! మీకంతగా
యతనిమీఁద నిష్టము లేకపోతే మాయిద్దరిని గెంటెయ్యండికాని
యిలాగున విడదీయడము మీకు ధర్మము కాదు. మీరు నాకుఁ దలి

కందు)లై యుండి యిటువంటిదో)హము చేయఁబూనుట పాడికాదు. నామాట వినండి! మీరు గర్భవాసమునఁ గన్నపుత్రికపై యేలదయ మాపరు? మీరే నన్నంధకారములోఁ బడవేస్తే నాజీవితానికి యింక వెలుఁగుజూపే వారెవరు? నాకు దిక్కెవరు, మ్రొక్కెవరు? మీ నోములపంటగాఁ గాంచిన మీముద్దుపట్టికోర్కె నెరవేర్పరా? యీ ధనధాన్యములు శాశ్వతమా? ఈమాయతనువులు స్థిరమా? బావను వెళ్ళగొట్టకండి!

గ: ఇవి నాటకాలు నవలలలో ఉండే మాటల్లాగున్నాయి? పూర్తిగా పాడవకుండగనే బుద్ధి చెప్పుటయే మేలు! ఏమేవు! దీనిని లోపలకు తీసికొనివెళ్ళు. (అని భార్యతోఁ జెప్పును)

సీ: దీనిమాట తరువాతఁ జూచుకొందము. వీణ్ణి బయటకుఁ బంపండి ముందు!

అ: (తల్లిచేయి పట్టుకొని) బావను పంపడానికి వల్లకాదు, ఇదుగో, ఇద్దరముఁ కలసి వెళ్ళిపోతాము! మాగురించి మీరాట్టే శ్రమపడ కండింక! (అని గౌరీపతికడకు వెళ్ళి నిలుచుండును.)

సీ: (కొమరితచేయి పట్టుకొని లాగి) ఏమిటేవు నీకు లెంపకాయలు కావాలా ఏమిటి?

గౌ: అన్నపూర్ణా! నామూలమున వారితో నీవు విరోధపడవలదు. నీ దయయుండిన నదియే పదివేలు! బొందెలోఁ బ్రాణ ముండిన, మనసులోఁ గోర్కె యుండిన, నేనాఁటికైనా గలుసుకొనిమె దము. మనలకు శ్రీపరమేశ్వరుడు దోడ్పడుగాక! ఇక సెలవు! (అని అత్తమామలకు నమస్కరించి వెడలిపోవును.)

అ: (మంచముమీఁద కూలఁబడి) వెళ్ళిపోతున్నావా బావా? నా మీఁద నీ కయినను దయలేదా? నాన్న అమ్మామాటలలోఁబడి మనసు రాయిం చేసుకున్నావా? నీమనసు కఱుగుట లేదా? తండ్రి!

ఎంతకఠినహృదయము నీది ఇంతకూ నాదురదృష్టము! (అని ఏడ్చును.)

సీ: పీడ విరగడయినది నేఁటితో? పదండి భోజనాలకు!

గ: అమ్మా రావే, భోజనము చేద్దాము! (అని కొమరితెను బిలచును)

అ: (అన్నపూర్ణ కండ్లనీరుఁ దుడఁచుకొనుచు) అన్నము తిన్నట్టే యున్నది నాన్నా! అమ్మా నీవూ యిప్పటివరకూ-నాకడుపునిండా పెట్టారు కాదూ! కడుపు నిండిపోయింది! ఇంక ఎలాగ తినఁగలను? నన్ను విడిచిపెట్టి మీరు వెళ్ళి సావకాశముగా, కడుపునిండా భోజనము చేయండి! నే నిక్కడ యింటికిఁ గావలి యుంటాను (అని పడుకొనును)

సీ: పదవండి- దాసియాఁకలి దానికి దెలియదా ఏమిటి? కడుపులో కాలే అదే వస్తుంది, "అన్నమో రామచంద్రా" అంటో!

గ: (భార్యతో) అవుమగాని, దీనివరుస బొత్తిగా బాగులేదు. బయట గొళ్ళెము పెట్టు - నా కనుమానముగా వుంది. మనను కీడు శంకిస్తోంది!

సీ: చాలూరుకోండి! అవేమి మాటలు? (అని ఇద్దఱును గలసి వెళ్ళుదురు.)

అ: (అన్నపూర్ణ గదిలోఁ బడుకొని విచారగ్రస్తురాలై విలపించుచుండ)

మాతాపితలకే । భారమైతిగా ।
మామక । ప్రియుఁడా । మొదబాసెనుగా ॥మా॥
చలి । పిడుగులలో । యుష్ణము లేలా ।
ఉష్ణములో । నీ । తీక్ష్ణము లేలా ॥మాతా॥
కంటక । సంయుత । మైనది కాయము ।
జంటబాసి । తి । వౌరా । దేవా ॥మాతా॥

గా: కంగారుగా వచ్చి ! అన్నపూర్ణా !

అ: (వెంటనే లేచి) బావా! (అని చేయి పట్టుకొనును)

గా: అన్నపూర్ణా! నిన్నుఁ గడసారి చూచి పోదామని వచ్చాను. నీవు నన్నిక మరచిపో- నేను భూమిమీఁద పుట్టనే లేదని యనుకో!

చ. తరుణిరో! చింతఁబాయుమి!-వి-ధాత సహింపక చేసెనింత, యె వ్వరి వనరాదు! నుంత, మన-ఫాలతలంబున నింతవ్రాయ నె వ్వరుఁగవఁగూర్పఁ గల్గుదు ర-భాగ్యుల; ధైర్యమూఁబూనియుండుమీ మరుచటిజన్మలో మనము-భార్యయు భర్తయు నౌదు మిద్దరన్!

అ: అదేమిటి బావా అవేమి మాటలు? నీవు లేనినాఁడు నా కీప్రపం చమే శూన్యము. నే నెవరిముఖపద్మముఁ జూచి బ్రతికేది బావా? నీ కేనాఁడో యర్పించుకొన్న ప్రేమధనాన్ని నాశముఁ జేసుకో మంటావా? నేను నీకునూ భార మయ్యానా బావా? నన్నింకను నర్థము చేసికొనలేదా?

గా: (అనపూర్ణచేయి పట్టుకొని) ఏనాఁడో యర్థమైనది కా నేమి చేయగలను? అసమర్థుడను! పట్టెపనికిమాలినవాఁడిని! కడు దరి ద్రుఁడను!

అ: (గారీపతిని పట్టుకొని) అలాగనకు బావా నేను వినలేను. డబ్బు లేకపోతే కూలి చేసి కొని జీవించెదము. ఆకూలికూడా దొరకక పోయిన, యాచనచేసి, జీవయాత్ర సాగించెదము. తక్షణము పద! ఎక్కడికైనను వెడలిపోయెదము. ఈగృహములో నొక్క-క్షణ ముండవలదు.

గా: అన్నపూర్ణా! నన్ను నమ్మి వచ్చిన నీకుఁ జాలమోసముఁ గలు గును. అల్లారుముద్దుగాఁ బెరుగునీవు నాతోడ వచ్చి కష్టజీవన మెట్లు చేయఁగలవు? ఈనుమకోమలివి! నేను నీ అవస్థను జూచి సహింప లేను!

అ: ఇంతటినుండి యని మరచిపోవలెను! ఇంకేమాత్రము నాలస్యము చేయవలదు.

గా: అన్నపూర్ణా! ధన్యుఁడను! నీవు నిజమగు జీవితసహకారిని!

అ: బావా!- ధన్యురాలను- నీవు నిజమగు జీవితసహకారుఁడవు!

---

## మూఁడవ రంగము

(మరియొక గృహస్థుఁడు, గిరిజావధానిగారిల్లు-వారి కుమార్తె "ఉమ" ఈర్చీలోఁ గూర్చుండి పాడుచుండగాఁ దెర లేచును)

మ. తొలిజన్మంబున నెట్టిదంపతులనో-దూరంబుసేయన్ ధరా
స్థలి వైధవ్యముఁ గల్గు స్త్రీకి సుఖవి-స్తారంబు శూన్యంబునా
బలువౌ జన్మము భర్తృపాదయుగసే-వాతత్పరుల్ గాని నా
రులు జీవించినఁ జచ్చినన్ యొకటె మే-లుం గూర్ప రెవ్వారికిన్.

ఉ: నాబ్రతుకు కడవినిఁ బూచిన పుష్పమువిధముగ నున్నది. ఏమి యుండి యేమిలాభము? అన్నియుండి యొదవతనము లేనట్లు గన్పడుచున్నది. బాల్యముననే వివాహముచ్చటగూడ తీరినది! ఆబాల్యములోనే వైధవ్యపుముచ్చటఁగూడ దీరుచున్నది! నే నేపాపపుణ్యము లెఱుఁగను! నేను విధవ నఁట! పోనిమ్ము, మరల వివాహము చేసుకొనెదమన్న సంఘము మమ్ములను వెలివేయునఁట! ఈలోకములో నావంటి యబలల యుసురు పోసుకోవడమేనా కేర్పడెనా యీసంఘాలు? ఆహా! దాంపత్యములో నెంత ఆనందము కలదు!

సీ. శారికా కీరముల్-సహితంబు గానంబుఁ
జేయు దాంపత్య మా-సించి మింట!
జంటఁబాసిన గువ్వ-వెంటనే మరణించు
నెడఁబాటు కోర్వక-నేడ్చి యేడ్చి!
కవఁగూడు వన్యమృ-గంబులుంగూడ, దాం
పత్యసుఖమె వాని-బ్రదుకుఁదెరువు!
కీటకనిచయంబుఁ-గ్రిందుమీఁదుం బడు
మిధునసంపత్తితో-మెలఁగుకొరకు!

తే. గీ. మిధునసంపత్తియే మిశా-మిగతజీవ
తతికి, మిధునసంపత్తియే-తల్లిదండ్రి!
మిధునసంపత్తియే బంధు-మిత్రకోటి!
మిధునసంపత్తియే పరమేశులీల!!

ఇందుకు మాయింటిలో నద్దెకున్న నన్నపూర్ణా గారీపతుల మార్గదర్శక దాంపత్యమే ప్రబలనిదర్శనము. ఎంతహీనస్థితిలోఁగూడ వా రానందముగఁగాలముఁ గడుపుచున్నారు! ఆహా! ఆగారీపతి యెంత స్ఫురద్రూపి! అన్నపూర్ణ యెంత సౌందర్యవతి! పాపము పూటకు బత్తెము లేకఁగూడ, వారు సుఖగృహజీవనముఁ జేయుచున్నారు! (అనుచుండగా నన్నపూర్ణ ప్రవేశము)

అ: ఏమండీ! ఉమగారు! ఒకసారి బిందె యిస్తారా! నీళ్ళు తెచ్చుకొని యిప్పుడే యిచ్చేస్తాను!

ఉ: అయ్యో! ఎందు కీయనండీ యక్కయ్యగారు! మీ కేమి కావలసినా మాయింటికి వచ్చి తీసుకొని వెళ్ళండి!

ఉ: (లోపలికి వెళ్ళి బిందె తీసుకొనివచ్చి యన్నపూర్ణకిచ్చి) ఇదిగో నండి యక్కయ్యగారు-పాపము మీవారికింకా నౌకరీ దొరక లేనట్లుంది!

అ: లేదమ్మా! దానిగురించే యెంతైనా శ్రమ పడుతున్నారు వారు! దేనికైనా ఆరోజు రావాలండి!

ఉ: అంతే లెండి ఎప్పుడూ మంచివాళ్ళకే కష్టాలొస్తాయి!

అ: కష్టాల తరువాత సుఖాలు రావంటారా?

ఉ: తప్పకుండా వస్తాయి! మీరెంత యోగ్యుగలవారండి!!

అ: ఓర్వక మనము చేసే దేమియు లేదు! ఈశ్వరేచ్ఛ యిలాగుంది! వస్తానండి, యిప్పుడే పట్టికొచ్చి యిస్తాను మీబిందె!

ఉ: అయ్యో! అదేమిటండి? అబిందె కేమి తొందర? మాకదే బిందెయా? అబిందె మీరు వాడుకోనండి కొన్నాళ్ళు! మీరు బిందె కొనుక్కున్న తరువాత నివ్వవచ్చు మాబిందె!

అ: ఎంతదయామయురాలవు తల్లీ? మీరు నిశ్చయముగా నాపత్ బాంధవులు!

ఉ: మంచిది అక్కయ్యగారు! వెళ్ళి రండి. (అన్నపూర్ణ వెళ్ళినతరువాత) ఆహా! ఎంతటి శాంతమూర్తి! ఏకోశమునందుఁగూడ నామె కాలేమిసంసారమందు విరక్తి లేదుగదా! మగువలకు మగఁడేకదా భూతలస్వర్గము! నాతికి పతికదా యమరపథము నొసంగును. వీరితో నెల్లయినను గాఢమగు పరిచయముఁ గలుగఁ జేసికొనవలయును.

# స్త్రీ త్యాగము

## ద్వితీయాంకము

### నాల్గవ రంగము

(సోదెమ్మగారిల్లు- ప్రవేశం : సోదెమ్మ.)

సో: మాతిమ్మన్న ఆఫీసునౌకరీతో నలిగిపోతున్నాఁడు! ఒకళ్లా, యిద్దరా, వందమందిమీఁద అధికారము చెలాయించాలి! ఏదైనా ఉద్యోగము సాటి రాదు. మావాఁడికి ఒక్క పెళ్ళికాకపోవడమే లోటు! ఆముఁడుముళ్లూకూడా పడిపోతే నాభారం తగ్గిపోతుంది. మావాఁడికి పెళ్ళి కాకపోవడ మేమిటి? ఉద్యోగస్థుఁడు, వాఁడికాళ్ళకు దండముపెట్టి యిస్తారు పిల్లని! (అనుచుండగా, తిమ్మయ్య ప్రవేశము: పాడుచూ)

తి: అమ్మా! ఎక్కడున్నావే?

సో: ఇక్కడే ఉన్నానురా, నాయనా! ఆఫీసునౌకరీ అయిందా!

తి: ఆఁ! అయింది. అవడ మేమిటి? ఒకళ్ళా యిద్దరా, వందమంది చేత పనిచేయించాలి; ఆపని అయినతరువాత పెద్దఆఫీసరుగారింటికి వెళ్ళాలి!

సో: (దగ్గరగా వచ్చి) ఆఫీసరుగారింటికేఁ? నువ్వు వెళ్ళడమే! నువ్వంటే అంతభిమాన మన్నమాట, ఆయనకు! నీతెలివితేటలు చూచి సంతోషించి ఉంటారు! నాకడుపుం నాఅదృష్టముకొలఁది పుట్టి

వురా నువ్వు! మనకుటుంబములో ఎవ్వరూ లేరు, ఉద్యోగము చేసినవారు, నువ్వు ఒక్కడవే, కనబడుచున్నావు ఇంతవరకూ!

తి: ఇంకా విను చెప్తాను. ఆఫీసరుగారిభార్యాగార్కి నేను తెస్తేనేగాని, ఏవస్తువా నచ్చదు. నేనైనా చింతపండు తెచ్చాననుకో, నాల్గు సార్లు మార్చాలి, నాల్గవసారి నచ్చుతుంది, రాద్ధాంతసిద్ధాంతా లన్నీ అయినాక! ఆతరువాత పిల్లలను కొంతసేపు ఎత్తుకొని, ఆ డించి అప్పుడు యింటికి వస్తాను.

సో: నాయనా! వందమందినౌకర్లు నీకు జడుస్తారా?

తి: జడవకపోతే ఏంజేగరు? డొక్క వాలికలు చేస్తాను; అదీగాక, నేనూ ఒకఆఫీసరునే నని వాళ్ళకు తెలియదూ? అవునుగాని అమ్మా నాకింకా పెళ్ళి చేయవేమే?

సో: అయ్యో! నాయనా, నీకు పెళ్ళి చేయకపోవడ మేమిటిరా? నీ లాంటిఉద్యోగస్థుడికి పెళ్ళికాకపోతే మరిమొకరికి అవుతుందింక? కాని ఒక్కవిషయమునుంచి డబ్బు చూసుకోవాలి!

తి: అదేమిటే! నీవు పిల్లను జూడు, నేను డబ్బు చూస్తాను! నాలాంటి ఆఫీసరుకి, అప్పుపుట్టకపోతే; ఈప్రపంచము తల్లక్రిందులై పోదూ? (అని మీసము దువ్వును)

సో: నీ కంత ధైర్యముంటే పిల్లనే తనేవురా చూడడమూ? చూడూ! మనఇంటిఎదుట గిరిజావధాన్లుగారింటిలో, అద్దెకున్నారే, అన్నపూర్ణమ్మగారూ!

తి: ఆఁ! ఉద్యోగము లేకుండా తిరుగుతాడు అతనిభార్య ఏనా?

సో: మరే నాయనా? అదేమిటిరా, అతను అలాగ తిరుగుతాఁడు! ఉద్యోగము లేదు సరే. చదువుకూడా వెలిగించాడట. అవునులే, చదువుకుంటేమాత్రం మదృష్టముండవద్దు? నీవు చూడు! చదువు లేకపోయినా, పెద్దయుద్యోగము సంపాదించావు!

తి: అవు నమ్మా! దేనికైనా, అదృష్ట ముండాలి లేకపోతే, వంద మందినౌకర్లమీాద ఛార్జీ చెలాయించడము ఎలా వస్తుంది?

సో: అన్నపూర్ణమ్మ పెదతండ్రికొడుకుదగ్గర పిల్ల ఉందట! ఆపిల్ల నుద్యోగస్తుడికే యిస్తారట! ఆపిల్లను చూద్దాము! ఆవిడ చెప్పిం దిలే మొన్న మాటలసందర్భములో!

తి: "అందంగా ఉంటుందా?" అని, అడిగేవా, లేదా? నేను చెప్పిన మాట వినాలి నాపెళ్ళాము- లేకపోతే నాకొద్దు పెళ్ళి అసలు!

సో: ఎలాంటిదైనా, మనయింటికి వచ్చాక మనము వంచుకొందా మురా నీ విప్పు డేమీా అనకు! వ్యవహారము చెడిపోతుంది. పెళ్ళి వా రొచ్చినప్పుడు నీ వేమీా మాటాడకూడదు, తెలిసిందా?

తి: ఏమీా, నాపెళ్ళినిగురించి మాటాడడానికి నాకు హక్కు లేదు? నే నెందుకు మాటాడకూడదు? నేను తెలివితక్కువవాఁడనా?

సో: నీకు తెలియదు నాయనా, చిన్నతనము! పెళ్ళికొడు కేమీా, మాటాడకూడదు. మాటాడితే పెళ్ళివారికి లోకువ వయిపోతాము!

తి: ఆఁ, ఏమిటమ్మా! నే నాఫీసరునని వాళ్ళకు తెలియదూ? ఏం చేస్తానో, చూచుకో, అలాగ నన్ను వారు లోకువ చేస్తే!

సో: (కొడుకుదగ్గరగా వెళ్ళి) నీవు ఏం చేస్తావురా నాయనా?

తి: ఏం చేస్తానో చెప్పనా? అమ్మా ఆపిల్లను పెళ్ళి చేసుకొని విడిచి పెట్టేస్తాను. అక్కడితో ఒదిలిపోతుంది వాళ్ళ తెగులు!

సో: ఆఫీసరువిగనుక, నాయనా అన్ని "లాలు" తెలుసును నీకు! నీలాంటికొడుకు ఒక్కడుంటే చాలదూ వంశ ముద్ధరించడానికి!

తి: అవునుగాని, అమ్మా! ఎప్పుడొస్తారే పెళ్ళివారు నన్ను చూచు కోవడానికి? అబ్బా! నాకు పెళ్ళి అంటే, చాలా సరదాగా నున్న దమ్మా చూడు! ఇప్పు డుంగరాలు మారుట కుంటునా రే.

అలాంటిపెళ్ళి నష్టు నాకు! బాజాభజం.త్రీ.. పెట్టి పెళ్ళి ఖని పెళ్ళిచేయా ల్యలి నాకు!

సో: నీకర్మ మేమి కాలి దినా నాయనా, ఉంగరాలు మార్చే పెళ్ళి చేసేవరకునూ! అతివైభవముగా పెళ్ళి చేస్తాను. లే! భోజనము చేద్దువుగాని!

(ఇంతలో భీమశంకరశాస్త్రిగారు సోదెమ్మగారింటికి రాగా)

భీ: ఎవరండీ యీయింట్లోనుంటు? సోదెమ్మగారిల్లి దేనాండీ? (అని అడుగును)

సో: ఇదేనండి ఏంబాబు? మా అబ్బాయితో మీకేమయినా పని యుందా? అబ్బాయి యింటిదగ్గరే ఉన్నాడు లెండి! ఉద్యోగము చేయుచున్నప్పటినుండీ, ఇనలా తీరిక లేదు బాబు - కాని యీవేళ ఎలాగో ఇంట్లోనే ఉన్నాడు.

భీ: ఓహో! అలాగా- సరె లెండి! నేను అన్నపూర్ణ అన్నగారి నండి!

సో: అలాగా! తమరేనా? దయచేయండి. దాహము తీసుకుంటారా?

భీ: అక్కరలేదు లెండి. మీతో నొకవిషయము మాటాడదామని వచ్చేను. మాదగ్గర అమ్మాయి యొన్నది. మాయావిడ కుద్యో గస్తుని కిచ్చి పెళ్ళి చేద్దామని యుద్దేశముంది.

సో: అయితే, మాయుద్దేశాలు మీయుద్దేశాలు, నొకటే నన్నమాట! ఉద్యోగములో నెంత గౌరవమూ, ఎంత మర్యాద యున్నదండి!

భీ: కాదమ్మా మరి! మాకు నలుగురాడపిల్లలు. ముగ్గురికి వివాహా లయినవి. ఈయొక్కపిల్ల యుండిపోయింది. అందరికంటె, నీకడ సారపుపిల్లంటే యెక్కువప్రేమ మాయందరికి! చాలా తెలివైన పిల్లకూడాను లెండి!

సో: అలాగా! అంత తెలివైన పిల్లా? మావాడికి దగిన పిల్లన్నమాట! మావాడు ఆఫీసంసి యెక్కడెక్కడినుండీ కట్నాలిచ్చి పిల్లనిస్తా

మని వస్తున్నారు. మా కిష్టము లేదు లెండి! పిల్లవాణ్ణి యమ్మ తున్న ట్లుంటుందని మేము సమ్మతించుట లేదు. అన్నివిధాలా మా కనుకూలముగా నుంటుంది మీసంబంధమయితే! ఈయాషాఢమాసము వెళ్ళిన వెంటనే పెట్టించండి ముహూర్తము. పెళ్ళి మీ యింటిదగ్గరే చేయించండి, అక్కడకే వచ్చేస్తాము మే మందఱము.

(వచ్చి) ఏమండీ మామగారు, నాభార్య ఎట్లాగా నుంటుందా? నేను చెప్పినమాట వింటుందా?

చాలలక్షణమైన పిల్ల నాయనా! చూస్తే నీవు విడిచిపెట్టవు!

తప్పు నాయనా, ఊరుకో! ఏదో చిన్నతనముకాదా! బాబు! వానిమాటలు మీరు లెక్క చేసుకోకండి!

దాని కేమి లెండి! మరి నాకు సెలవు (అని వెళ్ళిపోవును)

అదృష్టమంటే ఇలాగుండాలి! నీయుద్యోగముం జూచి నీకాళ్ళ మీఁద పడేస్తున్నారు పండువంటి పిల్లని.

ఆ ఆషాఢము వెళ్ళి శ్రావణమాసము ఎప్పుడు వస్తుందే అమ్మా?

అదే వస్తుంది లే, పద, ముందు మనము భోజనాలు చేద్దాము.

సోదెమ్మ తిమ్మయ్య.

సం సంసారంలో-కోడలే తోడునీడా కోడలే ॥నా॥

నాఐశ్వర్యం అంతా । నాకోడలిపిల్లే-చూడగా । కన్నతండ్రి-తిమ్మనా ॥నా॥

నాసౌభాగ్యంలో-నిల్చుగా । సామిరంగా-గోడగా ॥నా॥

నాకళ్యాణంతోడా । నాజీవికి- జోడూ - వచ్చుగా కన్నతల్లీ - సోదెమా॥

తి: మాసంసారంలో-కోడలే । తోడునీడా-కోడలే ॥మా॥

## అయిదవరంగము

### ప్రవేశము (అన్నపూర్ణ)

(విచార-గ్రస్తురాలై యుండును) అపుడామె భర్త పిచ్చివ
వలె వచ్చును)

అ: ఈవేళ బొత్తిగా నీరసముగా నున్నావేమి బావా? ఎక్కడా ఉ
ద్యోగము దొరకలేదా? పోనిమ్ము దానిని గురించి యంతగా వి
చార మెందుకు? ఈవేళ కాకపోయిన, రేపు దొరుకుతుంది!

గా: నా కింక యుద్యోగము దొరుకుతుం దనునాశ లేదు! ఎన్ని ప్ర
త్నాలు చేసినా, అవి బూడిదలో పోసిన పన్నీ రయిపోవుచున్న
నీవు నీతలిదండ్రులను విడిచి నాతో వచ్చినందులకు నీవనుభ
చెడి సుఖ మే మున్నది? వేళకు, అన్నమైనా, పెట్టలేక పో
చున్నాను!!

అ: నీవు తిని నన్ను పస్తుపెట్టుతున్నావా? లేదుకదా! కష్టసుఖము
మనము సమముగా బంచుకొనుచున్నాము. ఇది యొకవిధము
సంతోషముగనే యున్నది. అదీకాక, ఈదారిద్ర్య మెల్లకాల
మనయింటనే నిలచి కాపురము చేయబోవునా? ఎప్పటి కట్లు జ
గదు. అమావాస్య గడచినతరువాత పౌర్ణమి రాక మానదు
కష్టాలు గలిగినప్పుడే యోరిమి వహించాలి! నిజముగా బీదరిక
లోనే సుఖమున్నది!

గా: ఎట్లు ధైర్యము వహించవలెనో కాని, నా కేమియు బాలిపో
డను లేదు. నీగురించి నిశ్చయముగా నాప్రాణాలు నిలుపుకొ
చున్నాను. లేకపోయిన నీపాటికి నాత్మహత్య యొనరించుకొ
యుండెడివాడను! ఇంత విశాలప్రపంచములో నా కుపాధి దొ

కుట లేదు! ఎందఱి నెన్నివిధముల నాశ్రయించినను ఎంత విశ్వ
ప్రయత్నము చేసినను, ఫలితము శూన్య మగుచున్నది!

అ: ఇది యంతయు నాయదృష్టము. సుఖహానిలాభనష్టముల కాంచు
వారిదే యదృష్టమని లోకోక్తి కలదు!

గౌ: నీయదృష్టము కాదు. నాకర్మ కాని యిది- నీకర్మముగూడ గా
దన్నపూర్ణా! పుట్టినదిమొదలు నిప్పటివఱకు నాకష్టము లిట్లే నన్ను
వెంటాడుచున్నవి యే దేమి దుష్టనక్షత్రమున జన్మించితినో కాని!

అ: అలాగున విచారపడవలదు. నీప్రయత్నలోప మేమియు లేదు.
ఉద్యోగము లేక నెందఱు బాధపడుచున్నారో యీవిశ్వమానవ
ప్రపంచములో, మన యొక్కరమే కాదు బావా! లక్ష్మి చంచల
లక్ష్మి! కొందఱిని నవ్వించును మఱికొందఱి నేడిపించును!

గౌ: ఎంతటికష్టములలోఁగూడ నింతటి తియ్యనిమాటలు జెప్పి నా
హృదయానలముఁ జల్లార్పఁ గలుగుచున్నావు. అన్నపూర్ణా! నీవు
నిజముగ గాశీయన్నపూర్ణవే! నీవంటి యుత్తమస్త్రీ లింకనూ,
నీభూతలమున జీవించియుండుటచేతనే యీప్రపంచ మిట్లున్నది.
లేకున్న నీవరకే యేజలప్రళయమునకో గుఱియై నశించి పోయి
యుండెడిది. ఏది ఎట్లున్నను, నీకు భర్త నగుటచే కొంత మన
శ్శాంతి కల్గుచున్నది. నీవంటిసాధ్విని పోషించుకొనలేక పోవు
చున్నా ననువిచారము మాత్రము విడచుట లేదు!

అ: ఇట్టి యధైర్యపుమాట లనవలదు. భర్తకష్టసుఖాలలోఁ బాల్గొన
డానికి కాక, భార్య బ్రతికి సార్థకమేమి? సుఖ మొచ్చినప్పు డానం
దించి కష్ట మొచ్చినపు డాభర్తను బాధించుటకా భార్య జీవించి
యుండవలెను?

గౌ: (గౌరీపతి యేదియో జ్ఞప్తికి దెచ్చుకొనువానివలె నటించి) చెప్ప
మరచాను; ఈవిషయము విన్నావా అన్నపూర్ణా? మన యిల్లు

పీడివచ్చిన తరువాత నీమీఁద బెంగపెట్టుకొని మీనాన్నగారు గతించారఁట!

అ: ఆఁ!! నాన్నగారు గతించారా? (అని విచారించును)

గా: ఆతరువాత నత్తయ్య మఱిమీఁద కోపముచే నెవరినో యొక యిరువైయేఁడ్లవానిని దత్తత చేసుకొన్నదఁట!

అ: చేసుకొని సుఖముగా నామెనే యష్టైశ్వర్యములతో దులదూగ మనండి! ఇంక వారిసొమ్ము మనకు ఋణము లే దనుకొందాము, మనము, ఎవరిసొమ్మెవరికి యెంతకాలము ప్రాప్తియో యెవరు చెప్పగలరు? స్నానము జేసి మడికట్టుకొందువుగాని లే బావా!

గా: ఏమి స్నాన మన్నపూర్ణా! నాయట్టిదరిద్రు డింకొకఁడు పృథ్విలో నుండఁడు తల్లిదండ్రులచెంత నల్లారుముద్దుగా పెరిగిన నీయట్టి కుసుమకోమలికి నామూలమున నెన్ని యిక్కట్టులొదవినవో కదా! ఈగర్భదరిద్రుణ్ణి, ఎందుకు ప్రేమించా వన్నపూర్ణా! నీవు నిశ్చయముగా మోసపోతివి!!

అ: నీవు బొత్తిగా మతి పాడుచేసుకొనుచున్నావు! (ఇంతలో నొకవ ళ్లెములో బియ్యము మొదలగు సామానులు పెట్టుకొని "యుము" ప్రవేశము)

ఉ: అక్కయ్యగారు! ఇవిగో నండి. (అన్నపూర్ణ వెనుకకు దిరిగి చూచి)

అ: అవేమిటమ్మా! అవన్నీ ఎందుకూ?

ఉ: మీకొరకై తెచ్చానండీ! ఏమి, మాదగ్గర పుచ్చుకోనకూడదా? నేను మీచెల్లెలిలాంటిదానిని గానా? ఇఁకముందు నాయందు మీ రిట్టిభేదభావము పెట్టుకోకండీ!

అ: అయ్యో! మీరిట్లు సెలవిచ్చెదరేమి తల్లీ! మా బావకింకా ఉద్యోగము కూడా లభింపలేదు. మీయింటియద్దెకూడా నీయ లేక పోవుచున్నాముగద!

ఉ: [illegible] దీనికి [illegible] ఇంటియద్దె కేమి యొం దొందర లేదు! ఈయింటియద్దెతోడనే మేము జీవింప నక్కర లేదు. మీరు మాకండ్లయెదుట నుండడమే మాకుఁ బదివేలుగా నున్నది. మీదాంపత్యముఁ జూచిన మాకుఁ గన్నులపండువుగా నున్నది. మాయింటినుండి మీ రెక్కడకుఁ బోవ నవసరము లేదు. ఈశ్వ రుఁడు మేలుఁ గలుగఁజేసి బావగారి కేదయిన నుపాధిమార్గముఁ జూపింపకపోడు! వారిముఖబింబములో నేదో గొప్పతనముఁ గన బడుచున్నది!

అ: ఏది యెట్లాగైతే నేమి చెయ్యగలము? అన్నిటి కాశంకరుఁడే యున్నాఁడు దిక్కు!

ఉ: ఈశ్వరుని నమ్మినవారికే కొఱఁత యుండదు. పరిస్థితి మారుండినను గొన్నాళ్ళకవి యదృశ్యమై పోవును. మరి నేను వెళ్ళివస్తా నక్కయ్యగారు!

అ: మంచి దమ్మా!

గా; (లోపలినుండి వచ్చి) అన్నపూర్ణా! ఈ "యువతి" మన మీఁద నెందు కంత దయ?

అ: ప్రపంచములో నందఱుఁ జెడ్డవారలే యున్న మనవంటివారు బ్రతకడ మేలాగు? ఈశ్వరు డీనాఁడు "సుమ" ద్వారా ప్రసా దించాఁ డీవంటసామానులు! మీరు లేచి స్నానము చేయండి! నేను వంట చేస్తాను!

గౌ: పాపము! [illegible] చాలా [illegible]శాలవ్యాసము [illegible] కలది! [illegible]కోడు సౌ[illegible]వతి! [illegible] చిగుణవతి! ఇ[illegible] మం[illegible]గుణాలుగల యీామె కీవైధవ్య మెలాగ వచ్చినదో?

అ: అవును పాపము నాకూ అదే సందేహము! ఉమను జూచినప్పుడెల్ల మనసు కఱఁగిపోవుచుండును. పాపము చాలాచిన్నతనములోనే పెండ్లిచేశారనుకుంటాను.

గౌ: అయి యుంటింది! సరేలే! నీవు వెళ్ళి వంట చెయ్యి! (అన్నపూర్ణ లోపలకు వెళ్ళును. గౌరీపతి నిలచి)

సీ. అన్యోన్యదాంపత్య మమరియుండెను గాని
నిల్లాలిఁ బోషించు టెట్లు దేవ?
నారు పోసిన నీవు నీరుఁ బోయుదు వన్న
నాశతో బ్రతుకు ద హార్నిశంబు!
ఎన్నాళ్ళుఁ బడుదు మీ యిక్కట్టులే నాఁటి
కైన నంతంబు గావా? రమేశ?
తల్లివి, తండ్రివి దాతవు, దూతవు,
నీవే, మమ్మేల బ్రోవ రావ వేఁగ!

గీ. నడిసముద్రంబులో నావ నాఁగ నొడ్డు
గానకఁ దిరుగు మాదు దుర్గతినిఁ గాంచి
స్థిరసురక్షితపారమున్ జేర్చి పేద
ప్రాణులన్ నిలుపు మనాథ రక్షకుండ!

# ఆ ర వ ర ం గ ము

(అన్నపూర్ణ వంట చేయుచుండగా గౌరీపతి యొక ప్రక్కఁ గూర్చుని నెద్దియో పాడుకొనుచుండును. అంతట శ్రీ గౌరీశంకరశాస్త్రి ప్రవేశమై)

శ్రీ: బావగారేదో పాడుచున్నట్లున్నారే?

గౌ: (గౌరీపతి చూచి) ఓహో! బావగారా!! ఎప్పుడు రావడము?

అ: అన్నయ్యా! రా! కూర్చో!! అందఱుఁ గులాసాగా నున్నారా?

శ్రీ: అందఱుఁ గులాసాగానే యున్నా రమ్మా, యీ ఘడియకు! ఇప్పుడు మనసుందరివివాహముఁనుగురించి వచ్చాను. మీయింటి యెదుటనున్న వా రబ్బాయి కిద్దామని సంకల్పముంది! ఏమిటి మీ యుభయుల యభిప్రాయము?

అ: సోదెమ్మగారి యబ్బాయికా?

శ్రీ: ఆఁ! ఆయబ్బాయికే!!

గౌ: మనయింటి యెదుటివారిమాటా?

అ: అవును వారిమాటే! ఫరవాలే దన్నయ్యా! అన్నానికి లోటు లేదు. ఆ యబ్బాయి కేదో యుద్యోగ మఁటకూడాను! కాని, వానితల్లి సోదెమ్మ కొంచెము పెంకిమనిషి యంటారు. సరే! దాని కేమి!! "అత్తమంచి, వేముతీపి, యుంటుందా?"

శ్రీ: మనసుందరిమాత్రము తెలివితక్కువదా ఏమిటి? ఆవిడకంటె రెండాకు లెక్కువే చదివింది మనసుందరి. మరేమీ ఫరవా లేదు. అవునుకాని, పెళ్ళి ఖాయమైనది. మరి బావా, నీవు బయలుదేరి ముందుగా రావాలి పెండ్లికి! ఏమి బావా మాటాడవేమి?

గౌ: ఇప్పటినుండి నే నెందులకు, మీకిల్లె లోస్తుంది లే!

భీ: ఏమి యిక్క డుద్యోగ మూరికే పాడై పోతుందా? (అనుచుండగా గౌరీపతి ముఖము దించుకొనును. అది భార్య చూచి)

అ: అ దేమి టన్నయ్యా! అలాగంటావు? అందులో బావప్రయత్న లోప మేమీ లేదు. అదీ క ఇప్పుడు మాకుం గల్గిన యిబ్బంది కూడా యేమీ లేదు? ఎవరికొట్టుదగ్గరైనా కొనేపు నాలుగువద్దలు వ్రాసేడంటే పాతికరూపాయలిస్తారు, లేక పదిమంది పిల్లవాళ్ళకి ప్రయివేటు చెప్పాడంటే ముప్పదిరూపాయలు వస్తాయి. అవి చాలు మాపొట్ట గడవడానికి? బావంటే యీయూరిలో నందటి) యెంతో యభిమానముంది! నలుగురికిం దలలో నాలుకలా గుంటాడు. ఎవ్వరితోడను విరోధపడడు!!

భీ: అవును బావంగారికి మంచివాండే. మనతల్లి కొక తెకుతవ్వ! మన నాన్న కెంతో ప్రేమ యుతనిపైని! కాని, ఏమిలాభము? అత్త దుర్జనత్వము! మనయమ్మకి లొంగిపోయాండు. అమ్మయెలాగో వి చేసింది యుతనిమతి. మీయుభయులమీంద బెంగచేతనే నాన్న గారు కాలము చేశారు కొనకు! ఎవరినో యొకమాష్టివానిని దత్తము చేసికొందిపుడు. వారియాస్తికి వాండు హక్కుదారుండై యున్నాండు. ఎపుడో, యీమెనే, బయటకు పొమ్మంటాండని చూస్తూండండి!

గౌ: పాపము! అత్తయ్యకా దుస్థితి వచ్చిందన్నమాట? మామయ్య యుంటే, అదో తరహాగా నుండేది!

భీ: ఏమి తరహాగా నుండడము లే! నా న్నుండేకాలత్రి మతనిమాట లాము చెక్కచేశేదా! ఆమె చెప్పినట్లాయన తిరగవలసినదే కాదా! మాయింటిసంగతులు నాకుం దెలియని వే మున్నవి బావా?

అ: నిజమైన మాట చెప్పాలన్నా ... పాపము, బావకు నన్నిచ్చి పెండ్లి చెయ్యాలని ... ... ... శగా ... ... కానిమహా మాత పడవల్సింది కాదు. ఎప్పుడు బావమీద లేనిపోనిమాటలు నాన్నతోఁ జెప్పడమే! పోనీ, ఎలాగో, మాబ్రతుకు మేము బ్రతుకుతున్నాముగదా, నాన్న గతించాడు, ఎవరో పరాయివాణ్ణి తీసికొని వచ్చి పెంపడ మెందుకు? నాన్న నామీఁద నాశతో సంపాదించిన యాస్తి వానికిఁ జెందజేయుడ మెందుకు? వారిర క్తము లోనుండి పుట్టిన నాకుఁ జెందఁజేసిన పంచమహాపాతకములు, ఆమె మెడఁ జుట్టుకొనునా?

: అలాగు ననుకొనగూడ దన్నపూర్ణా! ఎవరి కెవ్వరికిఁ బ్రాప్త మో యెవరుఁ జెప్పగలరు? చెట్టు వేయువాఁ డొకఁడు- దానిఫల మనుభవించువాఁ డింకొకఁడు, ఇది లోకములో మనముఁ జూచు చుండుట లేదా?

: యథార్థము చెప్పితివి. (భీమశంకరశాస్త్రి వంకఁజూచి)

: వంట సిద్ధమైనది లే, అన్నయ్యా

: లేస్తానుగాని ప్రయాణాలమాట జెప్పండి ముందు!

: మీచెల్లెలు వస్తుందిలే యిప్పుడు బావా! నేను ముహూర్తము రెండుమూఁడురోజు లుందియనగా వస్తాను. నీయభిప్రాయ మేమి అన్నపూర్ణా?

: నీయిష్టమే నాయిష్టము!

: కనక అలా జరిగించండి బావగారూ!

దేవరవారియాజ్ఞ! వల్లెయనక దప్పదు శిరసా వహించుచున్నాను.

: పెరటిలో నీళ్ళు గాచి యుంచాను, వెళ్ళన్నయ్యా, స్నానము చేయి! (భీమశంకరశాస్త్రి వెళ్లినతరువాత) ఏఁ, నీవుగూడా రాకూడదా మాతో బావా!

గా: మీతో వస్తే యెలాగ చెప్పు? ఉద్యోగమునకొరకు ప్రయత్నము చేసుకో నక్కరలేదా? బాగుగా నాలోచించుచున్న పూర్ణా ఎపుడు నీమాట కెదురు జెప్పను. కాని, విషయమిది!

అ: అది నిజమే, కాని, నీవు భోజనమెక్కడ చేస్తావు? నీకు సదా పాయముగా నెవరు జేసి పెట్తారు?

(ప్రవేశము : ఉమ)

ఉ: బావగారు మాయింట్లో భోజనమెందుకు చేస్తారు? ఏమి మాయింట్లో భోజనము చేయకూడదా? నేను మీ చెల్లెలువంటిదానను కానా!

అ: అయ్యో! ఎందుకు కాదు? ఎందుకు మీయింట్లో భోజనము చేయకూడదు? భోజనము చేయవచ్చునుగాని, మాబావకు సిగ్గెక్కువ లెండి! ఎవ్వరింటికి వెళ్ళడు!!

గా: నేను స్నేహితు లింట భోజనము చేస్తాను. మీ కెందుకు శ్రమ!

ఉ: మా కేమి శ్రమండీ? మా కేమీ శ్రమ లేదు! మీరు భోజనము చేస్తేనే చాలు! నామాటలు గొట్టెయ్యడానికి వీలు లేదు!

అ: పోనీ, అనా చెయ్యండి "ఉమ" చాలా బలవంతపెట్టుచున్నది. అదీకాక, మనము వారింట్లోకి వచ్చినది మొదలు లెవరెవరో మమ్ము తింటున్నాము? వారిసొమ్మే!

గా: ఇక ముందు దినబోయేది వారిసొమ్మే! లోకులు గాకులు వంటివారు చూడు. నీలాపనిందలు బయలుదేరునేమో యని భయము.

ఉ: లోకులకు నేను వెరువను. లోకులకు వెరచి మనస్నేహము వదలుకుంటామా? మీ రటువంటి శంక పెట్టకోకండి! అక్కయ్యగారెప్పుడు వెళతారు?

అ: సాయంత్రమే ప్రయాణ మంటున్నాడు మాయన్నయ్య!

ఉ: అయితే యక్కయ్యగారు మీకు బట్టలు చాలా లేనట్లున్నవి- నావి రెండు చీరలిస్తాను- తీసుకొని వెళ్ళండి!

అ: ఎందుకమ్మా! మా వదినచీరలు గట్టుకుంటాను లెండి!

ఉ: వారింటికి వెళ్ళి వారిచీరలుం గట్టుకోవడ మేమిటి! నావిషయములో మీరెటువంటి యభ్యంతరమూం బెట్టుకొనకండి! ఇప్పుడే వస్తాను! (అని వెడలిపోవును)

గా: అన్నపూర్ణా! మంమంటే, ఈ "యుమ" కెందుకంత ప్రేమ? నా కర్థము కావడము లేదు!

అ: ఈశ్వరుం డీమెను మనకిష్టకాలము లో నాధారముగాం జూపించాడనుకొంటాను. నీకు ఉద్యోగము దొరకితే యామెఋణము మూండునిమిషములలోం దీర్చుకొనగలము. అన్నయ్యస్నాన మయిపోయుంటుంది భోజనానికి లేద్దాము పద! (అని ఇద్దఱుం గలసి వెళ్లిపోవుదురు)

(తెరపడును)

# స్త్రీత్యాగము

## తృతీయాంకము

### ఏడవ రంగము

("ఉమ" తనగదిలోఁ గూర్చొని పాట పాడుచుండును. పాట ముగిసినతరువాత)

మోదమే - మోదమే।
మోదమేచేకూరే - నాయెద ॥మోదమేచేకూరే॥
ప్రేమలేని - దీనకథతో - విసిగిపోతిని - దేవా మో॥
చేదోయిఁగో - పాలబాలా॥
మ్రొక్కులిడుదున్ - ముద్దుకృష్ణ॥
గోపలతాంగుల్ - నేలుదువీవే॥
ప్రేమమహిమతో - శౌరీ ॥మోద॥
ఉమాసతియా - గౌరీపతికే - తపములుసేయన్-ఇంతవరాకా।
జీవితమింకా - ఫలించెదేవా- దేవకీతనయా-కృష్ణా॥ మోదమే॥
మో - దమే - మో - దమే - మో - దమే॥

ఉ: ఆహా! ఈదిన మెంత సుదినము! గౌరీపతి నాయింటికి భోజనానికి వస్తాఁడు. అదృష్టవశాత్తు మానాన్నకూడా నింటిలో లేఁడు. అతని చెల్లెలిగారింటికి వెళ్ళాఁడు. అతనిచెల్లెలకు జబ్బుగా నుందఁట, కనుక నింతలో నెలాఁగా రాఁడు. ఈగౌరీపతినిఁ జూచినప్పటినుండి

శే. ఉద్యోగస్థులు. జమీందారులు మీలాగుననే తల్లికడుపుననే పుట్టినారు! మీరు నిజముగా నొక మహారాజుకడుపున పుట్టవలసినవారు. మీవిగ్రహము, మీవిగ్రహమునకుఁ దోడు బుద్ధి, ఈలాగ నొకవ్యక్తిలో సంపుటియైనవి. కాని బ్రహ్మదేవుఁడుఁ గొంత పరాకుగా వ్రాసేఁడనుకుంటాను మీలలాటరేఖ! మిమ్ముల నెంతసేపు చూచినా యింకాయింకా, చూడాలనే యుంటుంది. (అని దగ్గరగా కుర్చీ లాగుకొనును)

గో: ఉమా, యెవరైనా జూచిన బాగుండదు! (అని తన కుర్చీని కొంచెము దూరముగా లాగుకొనును) (మరల "నుమ" తనకుర్చీని మరింత దగ్గరగాఁ దీసికొని)

శే: ఎవరికోసమో నాయానందాన్ని చంపుకో మంటారా? మీ రేమీ యనుకోకుండా యుంటే చాలు; ఇతరులతో నాకుఁ బని లేదు.

గో: ఉమా! ఏమిటో మాటలధోరణి? నా కేమీ యర్థముఁ గావడము లేదు! తప్పు కాదూ?

శే: నాకుఁ దప్పని తోఁచలేదు. ఏమందురా, నేను బుట్టినదిమొదలు మీరు మాయింట్లో నడుగిడువరకు నడవినిఁ గాచిన వెన్నెలవలె నాబ్రదుకు నిరర్థకమైపోయినది. కాని, మిమ్ములను జూచినది మొదలు నామోడువడిన జీవితము వానచినుకులఁ దగిలి మరలఁ జిగురుఁ దొడుగుచున్నది. మీమీఁద నెన్నో యాశలుఁ బెట్టుకొన్నాను. నాజీవితము మీరే సార్థకముఁ జేయఁగలరని నాయంతరాత్మ మఱిమఱి చెప్పుచున్నది!

గో: ఉమా! నేను నాఅన్నపూర్ణకు ద్రోహముఁ జేయలేను. అన్నపూర్ణ నాప్రేమదేవత! ఆమెకు ద్రోహముఁ జేసిన శంకరునకు ద్రోహముఁ జేసినట్లగును. ఇటువంటిమాటలు విడిచిపెట్టు ముమారాణీ!

ఉ: మీరు నాప్రేమను స్వీకరించకపోతే మీపాదాల చెంత నాప్రాణాలు విడుస్తాను (అని చీరచెంగునుండి యేదియో తీసి నోటిలో వేసికొనఁబోవ గౌరీపతి "యుమ" చేయిఁ బట్టుకొని యాపి)

గౌ: ఉమా! తప్పుకాదూ? అలాంటివని చేయవచ్చా? ఆత్మహత్యా ప్రేమకుఁ గడపటి పరిణామమా?

ఉ: ఏమీ, అంగీకరిస్తారా యిప్పుడైనా? లేకపోతే, నే నొకనిముషము గూడ నీమేదినిని, జీవింపలేను. నన్నర్థం చేసుకోండి యిప్పుడైనా!

గౌ: అన్నపూర్ణ విషయ మాలోచించావా?

ఉ: బాగా ఆలోచించాను! మీప్రేమ నామెకు తొమ్మిది వంతు లిచ్చి నా కొకవంతు నివ్వండి చాలు. ఆమె కపకారము చేయుట నా యుద్దేశ మేమాత్రము కాదు. మిమ్ముఁను జూచినదిమొదలు, నాహృదయ మీవిధముగా మార్పుఁజెందినది. నాకుఁ బ్రేమభిక్ష పెట్టండి!

గౌ: నిర్భాగ్యుఁడను; నామీఁద నీ కంత ప్రేమెందుకు? నాకుఁ దెలి యకడుగుతాను.

ఉ: (నవ్వుచు) నా-మీ-మేలుకోసము తెలిసినదా?

గౌ: ఏమిటో, ఆమేలు?

ఉ: చెప్పనా! నాప్రేమ ఫలించడము-మీపెద్దరోజులు తొలఁగిపోవ డము- నేకకాలమున జరుగును. తెలిసినదా యిప్పుడైనా!

గౌ: అనగా నీసొమ్ముఁ దినుచుఁ గూర్చుండమనియా నీయభిప్రాయము?

ఉ: నాసొమ్ము తినడ మేమిటి? నేనే, మీదాన నగునప్పుడు, నాసొమ్ము మీసొమ్ము, గాదా? మీరుఁ గూర్చుండి తిన నక్కఱలేదు. మా నాన్నకుఁ దెలియకుండ నాయొద్ద నయిదువేల రూపాయలు దాచి యుంచితిని. ఇపుడే మీ కిస్తాను. మీ యిష్టము వచ్చిన వ్యాపారముఁ బెట్టుకోండి.

గా: (ఆనందముతో) ఆహా! "ఉమా" నీ వంత యుదారస్వభావము గలదానవు! నా అన్నపూర్ణ స్థానములో నీ వడిగినంత ప్రేమభాగ మిచ్చాను! ఉమా!!

ఉ: ధన్యురాలను. నాజీవితము సార్థకము చేశారు. మీకు శతసహస్ర ధన్యవాదములు. (అని డైలాగు పాడుదురు. ఇంతలో సోదెమ్మ గారు యింటికి వచ్చి)

గా: అంగజా! అంగజా!
అంగజా! ప్రణయాగ్ని! చల్లారె! ప్రాణముల్
శాంతితో! చెన్నొందు । వెన్నునికుమారా!

ఉ: ఆశలకు పాశమే । రెండుప్రాణులగలిపి
జీవితవు । మాపోడ । పయనమువగ

గా: భద్రమా । బాటలో । వెతలుదీరుపుచుండి!
భవసుఖాస్వాదవు । భాగ్యమీయువోశా।

ఉ: సుమబాణ । తతులమ । విడువకు । మన్మధా!
మహితసుఖములుగాంచి । మనగజూచెదము!

గా: మహితసౌఖ్యము।రహినిగాంచుచు।నీదులీల । సుఖమొందుదుము।

ఉ: జీవితమింక । ధన్యమాయెనని । జీవితెల్పుచున్నాదిగదె।

గా: సుమబాణా।

ఉ: మన్మధా।

గా: ఇక్షుపాణ్మి।

ఉ: మన్మధా।

గా: ఉ: మాదండ । నింక । బనవేలా । మన్మధా।

సో: ఏమిటమ్మా చేస్తున్నావు? మీనాన్నగా రూళ్లో లేనట్లున్నారు! అబ్బా! మీయింట్లో నెంతమంచివాసనలు వేస్తున్నవి. అనకూడదు గాని, భోగాలయిల్లులాగున్నది (ఉమ కోపగించుకొని)

ఉ: అదేమిటండీ, యలాగంటారు? భోగాలిళ్ళల్లోగాని మనయిళ్ళల్లో నగరవత్తులు వెలిగించుకోన రండీ?

సో: కాదమ్మా! మాటలా వచ్చేసింది యేమీ యనుకోకండి? అది గాక, అలాగు నన్నంతటిలో, నలాగై పోతా రేమిటి?

ఉ: ఫరవాలేదు లెండి. పెద్దలు మీ రేమన్నా, నాకుఁగోపము రాదు!

సో: (వెనుకకుఁదిరిగి గౌరీపతినిఁ జూచి) ఇదుగో గౌరీపతి! ఇక్కడే, ఉన్నాఁడే! వాళ్లావిడ, అన్నగారిఁటికి వెళ్ళింది. ఇతగాఁడు వెళ్ళ లేదూ! అయ్యో! అ దేమిటమ్మా? ఉద్యోగము లేకుండా, అలా తిరుగుతాఁడు? మగాఁడు కాఁడూ? మాతిమ్మయ్యను చూచు- చక్కగా ఉద్యోగము చేసుకుంటున్నాఁడు! అవునులే, ఉద్యోగము చేయటానికి తెలివితేట లుండవద్దూ? మావాఁడికి, ఇతగాఁడికి, ఎంతో తేడా ఉంది!

ఉ: అదేమిటండీ- మీతిమ్మయ్యలాగు వీరు బంట్రోతునౌకరీ చేస్తా రనుకున్నారా యేమిటి?

సో: మావాఁడు బంట్రోతని నీ కెవరు చెప్పారు? చాలులే! ఊరుకో- ఒకళ్ళమీద నింకొకళ్లు చిన్నా పెద్దా, అంతేకాని బంట్రోతా మావాఁడు? మావాఁ డొకచిన్న ఆఫీసరు! మీయింటికి వచ్చా నని, నీయిష్టము వచ్చినట్లు మాటాడుచున్నావు. సరేలే, వెళ్ళి పోతాను! (అని వెళ్ళిపోవును)

గౌ: (కుర్చీలోనుండి లేచి) సోదెమ్మగారియబ్బాయి బంట్రోతా? పాపము సుందరికి యన్యాయము జరుగుచున్నది. ఏదో, ఉద్యో గస్థుఁడని చెప్పారు వాళ్ళవాళ్ళు.

ఉ: ఆపిల్ల మీకు దగ్గరా?

గౌ: చాలాదగ్గర! మాపెదమామగారికొడుకు కూఁతురు. ఇలాగ నుంది, ఈప్రపంచధర్మము! అవునుగాని, "యేమా" నేనును

వెళ్ళాలి యీ పెళ్ళికి! అన్నపూర్ణ మరీమరీ చెప్పి వెళ్ళింది. నన్నుఁ గూడ తప్పక రమ్మని!

ఉ: సరే వెళ్ళిరండి. మళ్ళీ త్వరగా వస్తారా? అక్కయ్యను దీసుకొని వస్తారా ఎచ్చేటప్పుడు?

గా: ఇప్పుడుఁ దీసుకొని రాను. నెమ్మదిమీఁదఁ దీసుకుని వస్తాను. అది నీ కిష్ట మేనా?

ఉ: అలాగే కనఁబడుచున్నది నామట్టుకు మటుకి!

గా: అలాగే కనబడుచున్నా నా. అయితేయిలాగరా! (అని చేయిపట్టుకొని లాగి వెళ్ళిపోవును.)

తెరపడును.

---

## ఏ ని మి ద వ ర ం గ ము

(భీమశంకరముగారింట్లో నన్నపూర్ణ కూర్చొని యుండును)

అ: బావ వస్తా నన్నాఁడు! ఇంకా రాలేదు! ఎందుచేత రాలేదో తెలియకున్నది. ఒకవేళ, ఏదైనా, యుద్యోగము దొరికినదేమో మటుకీ, యుద్యోగము దొరికితే నా కుత్తరము వ్రాయఁడు? "ఉమ" యింటిలో మాబావ భోజనము చేస్తున్నాఁడో, లేదో, తెలియదు. అక్కడ తనకు సదుపాయము జరుగుచున్నదో, లేదో, పెళ్ళివారంతా వచ్చారు! ఈవేళయినా, ఏవేళకైనా, వస్తాఁడో రాఁడో! (అనుచుండగా సుందరి పెండ్లికుమారునితో వచ్చి)

సుందరి

పరిణయమె - తరుణిసౌ - భాగ్యం హ్హా హ్హా హ్హా
పరిణయమే - పరిణయమే - పరిణయమే॥
పరిణయమే - తరుణిసౌభాగ్యం॥
మోహముతో - మృదుభాషిణులెంతో॥
కోరెదరే - సహవాసం॥
కోరెదరే - సహవాసం - హ్హా హ్హా హ్హా ॥ప॥
కోరివేడిసతి - కాంతునికూడి॥
మోహతాపమును బాయునిపోనా॥
శాంతిని దాంతిని - గాంచున్॥
శాంతిని దాంతిని- గాంచున్ హ్హా హ్హా హ్హా ॥ప॥
ప్రేమకుసార్థకమే - ప్రియకాంతున్॥
గనుటా - ప్రేమస్వరూపుండతఁడే॥
ప్రేమలేనిజీవి - వృధాజగానా - మనినసార్థకమేమి ॥పరి...॥

సుం: అత్తయ్యా! ఈపెళ్ళికొడుకు పేరు తిమ్మయ్య యంటున్నారేమి! రూపముఁగూడ కోతిలాగుంటుందా? అత్తయ్యా! పెళ్ళికొడుకు నీకు నిజముగ నచ్చాఁడా? చెప్ప వత్తయ్యా?

అ: (సుందరిని దగ్గరగాఁ దీసికొని, తప్పు సుందరీ, ఎవరైనా నీమాటలు వింటే బాగుండదు! ఊరుకో!!

సుం: ఇందులోఁ దప్పే మిటత్తా? కోతిలాగుంటే మెవరికిఁ గావాలి! పెళ్ళి చేసుకొనేటప్పుడు రూపురేఖవిలాసాలుఁ దెలిసికొని మెవరైనా మెక్కడైనా పెళ్ళి చేసుకొంటారు. తిమ్మయ్య యందఁగాఁడు గాకపోతే నేను పెళ్ళి చేసుకో నసలు! ఇప్పుడే, చెప్తాను మానాన్నతో స్పష్టముగా!

అ: చాలేమి మాటలాడకు చక్కనిబుజ్జవాడు! పాతికేళ్ళుంటాయి! అందులో సద్యోగస్థుడు! నీవు బహు సదృష్టవంతురాలవు! నా న్న తెలివితక్కువమాటేమిటే, నిన్నుం గోతిరూపువాని కివ్వ డానికి ఇలా టింటు చెప్తూ దనకు! తప్పు! తప్పు!

సుం: నిజముగా చక్కనివాడా, అత్తయ్యా?

అ: నిజమే తల్లి!

సుం: అప్పుడుగాని, నాకుం దెలియ కడుగుతాను, అత్తయ్యా, మామయ్య, యింకా రాలేదేమి? ఏదైనా యుద్యోగములో, గుదిరేరా?

అ: ఏమోనమ్మా! ఏమీ తెలియుటము లేదు. (అనుచుండగ గౌరీపతి ప్రవేశము)

సుం: ఇదుగో, మామయ్య మాటలోనే వచ్చారు. నూరేళ్ళు ఆయుష్షు! అత్తయ్యా! మామయ్యను జూడు! ఆయనంగూడ నొకపెళ్ళికొడు కులాగం గనబడుచున్నాడు!

అ: (గౌరీపతివైపు సాభిప్రాయముగాం జూచి) ఇపుడేనా రావటము బాబూ? రా కూర్చో! అమ్మా! సుందరీ, మామయ్య కాళ్ళు కడుగుకొందుకు నీళ్ళు దీసుకొనిరా (అని గౌరీపతివైపుం దదేక దీక్షగాం జూచుచుండును. గౌరీపతి తల వంచుకుని కూర్చొనియుం డును) అదేమి టలా కూర్చొన్నావు? ఏమీ మాటాడవుండాను.

గౌ: (ఉలికిపడి యన్నపూర్ణవైపుజూచి)
ఏమీలేదు. ఆఁ! అన్నపూర్ణా! నీవు కులాసాగా నున్నావా? నీవు కోరినట్లు ముందుగారాలేకపోయాను. క్షమించాలి!

అ: దాని కేమిలే! ఉద్యోగ మేదైనా లభించినదా?

గౌ: లభించలేదు కాని, అన్నపూర్ణా, యింక నుద్యోగమును గురించి ప్రయత్నించ వలసిన యవసరము లేదు.

అ: (సంతోషముతో) ఎందుచేతనో చెప్పవు? ఇంత కొంబొట్లు లెక్కడివి? ఈవస్తువులు ధరించిన తరువాతనే, మహారాజులాగున్నావు నీవు?

గా: (కొంచెము కంగారుపడి సర్దుకొని) నీకున్ను మంచిచీరలుఁదెచ్చా నన్నపూర్ణా! అవిగో, ఆపెట్టెలో నున్నవి!

అ: నాకుఁగూడ తెచ్చావా? ఇవి యన్నీ యెక్కడివి మరి? భుక్తికే యిబ్బందిగా నుండెడిదికదా, ఇవన్నీ యెక్కడ సంపాదించావు చెప్పవు?

గా: చెప్పడాని కేమీ లేదు! నా కొక స్నేహితుఁడు దొరికాఁడు, అతఁడు జాల మంచివాఁడు! అతఁడు నాదుస్థితిఁ జూచి చాల జాలిపడి యతనివ్యాపారములో నొకవాటా యిచ్చాఁడు. కొద్ది రోజులలో నాచే బ్రత్యేకముగా నొకషాపు పెట్టించుతాఁడట! మన మిప్పుడు వ్యాపారస్థులము- తెలిసినదా?

అ: తెలిసినది! చాలా సంతోషమైనది! ఎన్నాళ్ళకు మనదుర్దినములు మనలను, వీడిపోయినవి! అయితే, మనసుందరి పెండ్లియయిన వెంటనే వెళ్లిపోదామా మనము?

గా: (కొంచె మాలోచించి) ఇంకా వ్యాపారము స్థిరపడలే దన్నపూర్ణా! మనము ప్రత్యేకముగ షాపు పెట్టిన తరువాత గాని నిన్నుఁ దీసుకొని వెళ్లుతాను. అంతవరకు ఇక్కడ నుండకూడదా?

అ: అలాగే యుంటాను! కాని, వీరింటికిఁ జుట్టపుచూపుగా వచ్చి, యిన్నాళ్లుండడము, బాగుండదేమో? సరేలే, ఆలోచిద్దా మింకా! అలాగే యుంటాను!

గా: అలాగచెయ్యి అన్నపూర్ణా! ఆపెట్టెలో నొకచీర తీసి సుందరి కియ్యి (అనుచుండగా భీమశంకరశాస్త్రిగారక్కడకు వచ్చి)

భీ: ఓహో! బావగారి కిప్పుడు తీరికయినట్లున్నది!

ా: నిజముగానే తీరిక లేదు బావా! అంతా క్రొత్తవ్యాపారము!!!

: ఆఁ! అయితే బావగారిప్పు వ్యాపారస్థు లన్నమాట! అవును గాని, బావా నీ కుద్యోగమే దొరకనియ్యాళ్లో నీచేత వ్యాపార మెవరు పెట్టించారు? బోలెడుడబ్బు మదుపుపెట్టి!

ా: ఎవరైనా యుంటారు దయామయులు! అదీకాక, మంచిరోజులు వచ్చినప్పుడు, అలాగ దమంతట దామే అన్నీ చక్కబడతాయి.

: అవునంతే లే! కాళ్లుఁ గడుగుకో, వచ్చిన వాడవు వచ్చినట్టే కూర్చుండిపోయా వేమిటి?

: మాకష్టాలినాఁటికి గట్టెక్కాయి యన్నయ్యా! ఆశంకరునిదయ వలన (అనుచుండగా భీమశంకరశాస్త్రి లోపలికి వెడలిపోవును. వారు నిష్క్రమించిన తరువాత సోదెమ్మ తిమ్మయ్యలు మాటలాడుకొనుచుఁ బ్రవేశము)

: అమ్మా! నా కాక్రొత్తకండువా వద్దే! నాపాతపచ్చకండువా వేసుకుంటానే! నాకండువా లేకపోతే నన్నెవ రుద్యోగస్థుఁ డనుకోరు!

ో: తప్పురా! ఆకండువామాట యెత్తకూడదు! అది యుద్యోగములో నున్నప్పుడే కాని యిపుడు వేసుకొనకూడదు. అవి సేవకుల కిచ్చే బట్టలు!

: అయితే వేసుకొనకూడ దన్నమాట! అవునుగాని, అమ్మా నా పెళ్ళా మింకా నాకుఁ గనబడ దేమే?

ో: ఒకగంటలో నదే కనఁబడుతుంది! నువ్వేమీ మాటాడకూడదు తెలుసునా? ఊరుకోవాలి. (అని వెనుకవారినిఁ జూచి) ఇదుగో గౌరీపతిగా రొచ్చేరే పెండ్లికి! రా రనుకొన్నాను! అక్కడ "ఉమ" చేతిప్రసాదముఁ దగలడమే చేత!

అ: అదేమిటమ్మా? అలాగంటావు! ఆదయామయకుఁరాలు మామీఁద జాలిపడి సాహాయ్యముఁ జేస్తున్నది. ఆమెఋణము మేమెన్ని జన్మములకుఁ దీర్చుకొనలేము. ఆమెను మాకొకదయాధరువుగా జూపాఁడీశ్వరుఁడు మాకష్టకాలములో!

గా: చాలా బాగా చెప్పావన్నపూర్ణా! "ఉమ" స్వభావము బాగాఁ జెప్పఁ గలిగావు!

పా: పోనీ, ఎవ రెలాగపోతే మా కెందుకూ? ఏదో, ఉండలేకనేశాను!

శి: రావే అమ్మా! పైమై పోతున్నది (అని తల్లినిఁ దీసుకొని లోపలికిఁ బోవును)

గా: అన్నపూర్ణా! ఈసోదెమ్మ నిజముగా సోదెమ్మే! పేరునకుఁ దగినట్లుం దీమనిషి- పెద్దలు బాగా- ఆలోచించి- పెట్టె రాపేరామెకు!

అ: బాగా చెప్పావు, మఱిలగ్నము సమీపించుచున్నది, లోనికి పోవుదమువద. (అని యన్నపూర్ణ లోనికి వెళ్ళును)

గా: సర్వేశ్వరా! నాఅన్నపూర్ణదగ్గర నెన్నియసత్యములుఁ బల్కుచుంటిని. అటు లసత్యములుఁ బల్కి నామానసంభ్రమంబులఁ గాపాడుకొనవలసి వచ్చుచున్నది. ఇది నిశ్చయముగా ద్రోహమే! ఇంతకన్న ద్రోహ మింకేమి కలదు? అచట- "ఉమ"- నిచట "నన్నపూర్ణ"- పైన- నీవు- పరమేశ్వరా! మీముఃవ్వురు నాకుఁ గావలసినవారే! బుద్ధిమాంద్యమూలేక నన్నుఁ దిప్పి కాపాడు చుండుము (అని నమస్కరించును)

సీ. బాల్యమాదిగ నన్ను-భారమనకఁ బెంచు
నత్తమామల దుర్న-యంబుఁ జూడ,
ఆత్మీయయులగువారి-నవసరస్నె వేద్య
చేష్టలు, నడిమంత్రి-సిరులుఁ జూడ,

సీతతోడ బ్రతుకునా-సీతతోడ చా...
మురిసి వచ్చిన యింద్రు-పుత్రు జూడ
ప్రేమలో సమభాగ-మీయమని నేఁడు, ప్రి
శాంతహృదయ "సుషమా-కాంతఁ" జూడ,

తే. గీ. దైవమా తోఁపదయ్యెనే-భవనిలాన
భాగ్య మేమొ? ఇది యదృష్ట-భాజనంబ?
దుఃఖభాజనంబఁ దెలుపు-తోయజాక్ష!
లేక నావతనం బేమొ?-లోకనాథ!

(తెరపడును)

---

## తొమ్మిదవ రంగము

(తిమ్మయ్య యాఫీసునుండి వచ్చుచు రోడ్డుమీఁద నిలువబడిన వైఖరినుండి)

తి: నాకు పెళ్ళయింది. పెళ్లాం వొచ్చింది. అదృష్టమంటే నాదే! ఎందుచేత నంటారా! నాపెళ్ళాం ఎంతందముగా నుంటుం దను కొన్నారు. రంభ, యూర్వశి, మేనక, తిలోత్తమ, అంటారే, మఱివాళ్ళను నేను జూడలేదు- కాని- వాళ్ళుఁగూడా, నాపెళ్ళాము పాదాలమీఁద పడవలసినదే! నీమాటేమిటీ, నువ్వు పడతావా లేదా అంటారేమో, నేను పడవలసిన అవసరము కనఁబడదము లేదు. ఎందుచేత ననగా అది నాపెళ్ళాము! అదే నాకాళ్ళమీఁద

పడాలి. అలాగ పడఁబోతే తూమెడంత "దవాలీ"తో వళ్ళు చిదుకఁ గొడతాను! (అని కొంచెము మాలోచించి) అవునన్నట్టు మఱచిపోయాను! ఈ "దవాలీ" దానికిఁ గనపడకుండా దాఁచెయ్యాలి! ("దవాలీ" మడత బెట్టుకొని) కొంపఁదీసి యీ "దవాలీ" నాపెళ్ళానికిఁ గనపడిందంటే నామర్యాదంతా ఒక్కసారిగా పోతుంది! బాగా జ్ఞాపకానికి వచ్చింది- సమయానికి సమయమే! ఇది యింతా యిలాగ ఉండనివ్వండి! ఇంతకు, నా పెళ్ళాము నన్నుఁ జూచి యెప్పుడూ నవ్వదేమి? కారణ మేమిటో తెలియదు. కొత్తగొడ్డు కాదూ? భుజము వలిగేదాకా, సందులలోకి గొందులలోకీ, బండి లాగేస్తుంది. పదిరోజులు పోతే పరిపాటై పోతుంది! అప్పుడు నవ్వేస్తుంది! ఒకవేళ, నేను ఆఫీసరునని బెదుస్తున్న దేమో! అయితే మెచ్చుకుంటుంది. అభయ ముండడమే మంచిది. (ఇంతలో తిమ్మయ్య ఆఫీసరుగారు సైకిలు మీఁద నాత్రోవను బోవుచుఁ దిమ్మయ్యను జూచి)

ఆ: ఏమోయి ఆఫీసరునని తెలిసో గల్భాలు కొడుతున్నా వేమిటి? ఏమి, ఆఫీసరు నయిపోదామని యుందా యేమిటి? ఉంటే, చెప్పు నేను చేస్తాను.

తి: (ఆఫీసరును జూచి తిమ్మయ్య కంగారుపడి చేతులు నలుపుకొనుచు) చిత్తం! చిత్త!! చిత్తం!!! క్షమించాలండి!

ఆ: ఉండు! అలాంటి యుద్దేశ మున్న సెలవు ది. సరే ఆఫీసరు వవుదువుగాని, ముందు నీవు "దవాలీ" వేసుకొనకుండా వీధులో నెందుకుఁ దిరుగుచున్నావు? నాకు సమాధానము చెప్పు.

తి: ఉందండి! జేబులోఁ బెట్టుకొన్నా నండి!

ఆ: (తిమ్మయ్యవైపుఁ జూచి) నీకు "దవాలీ" వేసుకోవడానికి నామోషీగా ఉందా? అవు నాఫీసరువి) యెలా వేసుకుంటావు? ఏదో

యింటికొచ్చి యఘోరించావు అనీ, యిచ్చా నీనౌఖరీ! కూలీల దగ్గర కమీషనులు పుచ్చుకుంటున్నావంట తెలిసింది నాకు! వాళ్లు నాదగ్గరకు వచ్చి గోల పెడుతున్నారు! నీకు సరిగా బ్రతకడానికి రోజులు లేవు! ఎన్నిసార్లో చెప్పాను నీకు బుద్ధి లేదు. ఇంకొకసారి యిలాటిది చూస్తే నీనౌకరీ తీసేస్తాను, జాగ్రత్త! ఇంకా వేసుకో వేమి "డవాలీ" మెడలో! (అని యదమాయించును.)

తి: వేసుకుంటాను బాబు! (అని హడావిడిగా వేసుకొనుచు) ఈసారి కీతప్పు క్షమించండి బాబు! ఇంకెప్పుడు నీలాగ చెయ్యను; క్రొత్తగా పెళ్ళిచేసుకున్నాను, మొన్ననే! మీరు పని తీసేస్తే మొగుడుపెళ్ళాలము బ్రతకడ మెలాగ యీమహాకఱవులోను?

ఆ: నీముఖానికిఁ బిల్ల నిచ్చినవా ళ్ళెవరు? ఊ!! సరే క్షమించా నిప్పటికి! ఇఁకముందు జాగ్రత్తగా చేసుకో నవుకరీ, లేకపోతే, చెడిపోతావు! (అని ఆఫీసరుగారు వెళ్ళిపోవును)

తి: ఒకగండము గడచింది! ఈవేళ లేచిన వేళావిశేషముచేవల్ల!! నేను చేసేపనులన్నీ, ఆఫీసరుగారికి మెల్లిగాఁ దెలుస్తున్నాయి. ఎవఁడో మోసేస్తున్నాఁడు! నాయుద్యోగ మెప్పుడో, ఒకనాడు, హటాత్తుగా, ఊడిపోతుందని భయముగా నుంది. (ధైర్యముదెచ్చుకొని) పోతే పోనిద్దూ! నాలాంటి తెలివైనవాని కేయుద్యోగమైనా, మూఁడునిముషాలలో దొరుకుతుంది! ఇది పోతే దీనిబాబులాంటి యుద్యోగ మింకొకటి దొరుకుతుంది!

# స్త్రీ త్యా గ ము

## చ తు ర్థాం క ము

### ప ది య వ రం గ ము

(గిరిజావధానులుగారింట్లో "ఉమ" పాడుచుండగాఁ దెరలేచును)

ఉ మ

పరిణయము స్త్రీ-ప్రాణాస్పదం బా॥
బ్రదుకే శోకా-స్పదము-ప్రేమశూన్య॥పరిణయము॥
ప్రేమామృతయుత-ధారాపాతము।
అయిననాఁ డనఘా।
స్వేచ్ఛాపరిణయము-దీక్షా-మార్గము। కలదాననుగానే
పరిణయములోనే-బ్రదుకుభాగ్యము-లేదా।
సుఖములు రావా-సుఖానుభవమే- సతము-భూతలనాకం।
అగునది కోరీ-ప్రేమవిహారీ॥పరిణ...॥
నాతిబ్రదుకె స్త్రీ-జాతికి తేజం।
నీతికి పతిపదమే-త్రోవా।
కలిమీ- లేమీ-ధ్వాంతమందు-శాంతుండే కలికి జ్యోతి॥
పరిణయములోనే-కలదు జీవనభాగ్యం।
ఆశా-బీజము-పరిణయములోన-మొలచు ధాత్రి గనంగా।
పరిణయము కాదే-భాగప్రదాయీ॥పరిణ...॥

ఉ: గౌరీపతి యింకను రాలేదు! బహుశః అన్నపూర్ణక్క డాపు చేసిందేమో! అయి యుంటుంది!! అతనినిఁ జూడని నిముష మొక యుగములాగఁ గనఁబడుచున్నది. ఇందు దైవమహిమ మే మున్నదో! ఎవరినిఁ జూచినను జలింపని వజ్రమువంటి నామన స్సీతనిఁ జూచిన మరుక్షణమునుండి నీళ్ళకంటె పల్చనై కఱఁగి పోవుచున్నది! ఇది విధివిలాసమై యుండనోపు! విధివిలాసమైన మాత్ర మేమి లాభము కలదు! నాజనకుఁడును, గౌరీపతిభార్య యన్నపూర్ణాదేవియు, సమ్మతించినఁ గదా నా కానందము కలుగుట! అపుడుగదా నామానసలతాంకురము వసంతఋత్వాగమమునఁ జిగిర్చి లేఁజిగుళ్ళు దొడుగుట! అపుడుగదా నాకోరిక లీరిక లెత్తి జీవితరసాలఫలమునకు మాధుర్యముఁ జేకూరుట (అనుచుండ గౌరీపతి ప్రవేశించును)

గౌ: ఏమిటి, "ఉమా!" ఎంత తియ్యనిమాటలు మాట్లాడుచున్నావు? ఏవి మరల నొకసారి పలికి నీపలుకుతుషారచయమున నా బీడువడిన మానసభూమిని మొలక లెత్తింపవా?

ఉ: (సంభాషణముఁ జేయుచు లేచి) అన్నీ వింటున్నా రన్నమాట! ప్రేమలో దొంగతనాలు కూడానా?

గౌ: ఇపుడు మనముఁ జేసేవన్నీనీ, దొంగతనాలుఁ గావా?

ఉ: ఇపుడు దొంగతనాలలాగఁ గన్పించినా మంచిరోజులు వచ్చేటప్పుడు యివి మంచితనాలుగా మారును! అవునుగాని, యిదేనా, రావడము! అక్కయ్య కులాసాగా నున్నదా?

గౌ: ఇదే రావడము. అక్కయ్య కులాసాగానేయున్నది. రావడము తోడనే మాదేవిగారి దర్శనమునకు రాక వేరొకచోటికి గౌరీపతి మేనునఁ బ్రాణ ముండఁ బో లేఁడు!

ఉ: శివదర్శనానికే "యుమా" కాంత యెదురుచూచుచున్న దను కోకూడదు?

గౌ: అలాగ కాదు. "ఉమాకాంత" దర్శనానికి శివుడునూ, శివద ర్శనాని "కుమాకాంతయు" నెదురు చూచుచున్నారని యను కొందము!

ఉ: బలేగా నున్నది మనసంభాషణము! మఱి యక్కయ్యనుదీసుకొని రాలే దేమండి?

గౌ: మన మనుకొన్నాముగా! పావు పెట్టాక తీసుకొని వద్దామని!

ఉ: అలాగ చెయ్యడ మేనా, మీసంకల్పము? సరే, బాగుంది, కాని మనగొడవ మాక్కయ్య కేమైనా తెలిసినదా? పోదెమ్మ పెళ్ళికి వచ్చినది యక్కయ్యతో నేమయినా మనప్రణయముసంగతి చెప్పిన దేమో యని కంగారు పడ్డాను. ఏమీ చెప్ప లేదుకదా?

గౌ: చెప్పలే "దుమా!" కాని, ఏదో తనమామూలుసోదె కొంత వెళ్ళబోసింది. మనయున్నవృత్తాంతము విస్తారము మాటాడ నీయలేదు.

ఉ: అంతవరకూ, ధన్యులమే లెండి? అవును కాని, పెళ్ళి సవ్యముగా జరిగినదా? ముఖ్యమైన మాట, అది చెప్పండి ముందు!

గౌ: ఏమి సవ్యముగా జరగడము! ఏడుపులతోడను, పెడబొబ్బలతో డను, జరిగింది! సుందరికన్నీళ్ళు నేను జూడలేక పోయాను!

ఉ: అలాగా పాపము? ఉండండి, యిప్పుడే, వస్తాను. (అని లోపలికి వెళ్ళి, అయిదు వేలరూపాయలుం దెచ్చి) ఈడబ్బు మీదగ్గరుంచి వ్యాపారము ప్రారంభించండి.

(అని యిచ్చును-ఆడబ్బు పుచ్చుకొని గౌరీపతి జేబులోం బెట్టు కొనును)

గౌ: "ఉమా" నీఋణ మెన్నిజన్మాలకుం దీర్చుకోలేను!

ఉ: మీరు నన్ను మనసారఁ బ్రేమిస్తే చాలు! ఇఁక ఋణముఁ దీర్చ నక్కఱలేదు! (అని యనుచుండ "ఉమ" తండ్రి గిరిజావధాన్లుగారు ఊరినుండి వచ్చి తలుపు తట్టును. "ఉమాగౌరీపతులు" కంగారు పడుచుందురు)

గి: అమ్మా! ఉమా! తలుపు తియ్యి తల్లీ! (అని పిలచును)

గౌ: (కంగారుతో) "ఉమా" మీనాన్నగారు రొచ్చారు కొంప మునిగింది!

ఉ: ఫరవాలేదు కంగారు పడకండి! దొడ్డిదారివెంట మీగదిలోనికి వెళ్ళిపొండి యిప్పటిమట్టుకు! (అని దొడ్డితలుపుఁ దీయుచుండగా)

గి: అమ్మాయీ! నిన్నే పిలుస్తుంట! నిద్ర పోతున్నావా తల్లీ?

ఉ: ఆఁ! వస్తున్నాను నాన్నా! (అని గౌరీపతివైపుఁ జూచి) ఊఁ! మీరు వెళ్ళండి (అని దొడ్డితలుపు మూసి వీధితలుపుఁ దీయును)

గి: (లోనికి వచ్చి యిల్లంత నొకసారి కలయఁజూచి కూర్చొందును.) రా! తల్లీ నీవు కూర్చో!

ఉ: ఏమి నాన్నా, ఉత్తరం వ్రాయకుండా వచ్చేశావు? అత్తయ్య కులాసాగా నుందా?

గి: అత్తయ్య కులాసాగానే యుంది కొంచెము; కాని, నిన్ను విడిచి పెట్టి యున్నా క్షేమ్మ దుండలేదు. ఈసారి తప్పనిసరిగా నుండవలసి వచ్చింది. ఇన్నాళ్ళయినా, ఎలాగున్నానో, నాకే తెలియుటము లేదు. నిన్నుఁ జూచుకొని నీతల్లి పోయిన వెంక మఱచిపోవు చున్నాను నాచిట్టితల్లీ!

ఉ: నీవు ఎన్నివిధాల చూస్తే ఏమి సార్థకము నాన్నా? భర్తలేని బ్రతుకు బూడిదలో పోసిన పన్నీరుఁగదా?

గి: అందుకే తల్లీ, నాలో నేను కుమిలి కుమిలి యేడుస్తున్నాను! ఎంత యేడ్చి యేమి లాభము తల్లీ?

ఉ: మనసుంటే మార్గ ముండకపోదు. ఆలోచిస్తే లాభ ముండకపోదు నాన్నా (అనుచుండగా సోదెమ్మ యింతలో వారింటికి వచ్చును)

సో: ఏం బాబూ! ఈమధ్య యెక్కడా కనబడడములేదు? ఏదైనా, ఊరెళ్ళా రేమిటి? ఇక్కడ వయసులో నున్నపిల్లను, ఒంటరిగ వదిలిపెట్టి యిన్నాళ్ళుండిపోవడము బాగుందా?

గి: ఉండవలసి వచ్చిం దమ్మా. ఉండిపోయాను! మాచెల్లెలికి జబ్బుగ ఉంది– అందుచేత నాతల్లిని విడిచి యున్నాను. ఏం చెయ్యమం టారు? డబ్బుంటేమాత్రం ఏం లాభము? దిక్కు లేకపోయాక! అర్థ బలము సంపాదింపవచ్చునుగాని అంగబలము సంపాదించలేము!

సో: లేకపోవడ మేమిటి నాయనా! గౌరీపతి యున్నాడుగా పెద్ద దిక్కు! అంతకంటెదిక్కెవ్వరు కావాలి? (అనుచుండగా "సుమ" కంగారు పడుచుండును. తండ్రికూడకంగారుపడి మరలనాలోచించి)

గి: అవును, దిక్కు లేనివారికి భగవంతుడే దిక్కు చూపుతాడు! తల్లీ! నీవు లోపలికి వెళ్ళు! [అని "యుమ"ను లోపలికి బంపి వేయును]

సో: బాగా చెప్పారు! మంచిదిక్కే దొరికింది! నిరుద్యోగంవాడు నిర్భాగ్యుడు!!

గి: ఉద్యోగము లేనివాళ్ళు చెడ్డవాళ్ళనియా, మీయుద్దేశ్యము ఒక్కనాటి కలా కాదు! ఉద్యోగ ముంటేనేమి, యుండక పోతే నేమి, హృదయము విశాలమై యుండాలికాని, అదీకాక గౌరీపతి చాలా మంచివాడు. నే నూరికి వెళ్ళేటప్పు డమ్మాయినిం జూచు చుండమని. నేనే చెప్పాను!

సో: [దవుడలు నొక్కుకొనుచు] అయ్యో! అయ్యో! ఇదేమి విడ్డూ రము నాయనా? వడుచుపిల్లని చూస్తుండమని వడుచువాడి వప్పజెప్పి వెళతారా ఎక్కడైనా? బాగానేయుంది. ఘాతుం

చేసేతప్పులు సర్దుకుంటున్నావా! అందుకనే- కాలం ఇలా మండి పోతున్నది? పోనీలే, నా కెందుకు? ఎదో యింటిమెదుట ఉన్నా రని, చెడిపోతున్నారని, కులంలో వెలి వస్తుందేమోనని, మీమేలు కోరి చెపుతున్నాను!

గి: [కోపముతో లేచి] నీ శ్రీరంగనీతు లింకఁ గట్టిపెట్టి బయటకు నడు ముందు. నిన్నుఁ జూచిన నాయొడలు మండిపోవుచున్నది! నీవంటి చీడపురుగు లుండుటవలనే మనదేశ మింకను బాగుపడ లేదు! వెళతావా వెళ్ళవా! (అని యాగ్రహముతో సోదెమ్మకు దగ్గరగా వచ్చును)

సో: అయ్యో! చూడండి నాయనలారా! కూఁతురుచీకటితప్పులుఁ గడుపులో పెట్టుకొని చచ్చేముండను చీడపురుగు గంటున్నాఁడు. (అని వెళ్ళిపోవును) (సోదెమ్మ వెళ్ళినతరువాత గిరిజావధాని విచా రముతోఁ గూర్చుండును)

గి: అయ్యో! నా కెటువంటి విషమపరిస్థితులు తటస్థించినవి! ఒకవంక సోదెమ్మ దుష్ప్రచారము! ఇంకొకవంక నాచిట్టితల్లి కన్నీటి వెల్లు వలు! ఏమి చెయ్యవలెనో, నాకుఁ దోచుట లేదు! ప్రపంచధర్మ మెలాగుందో చూడండి! భర్త గలభార్య యేమి చేసినా తప్పు లేదఁట! భర్త లేనిపడంతి ఏమిచేసినా తప్పఁట! ఏమైననూసరే, నాచిట్టితల్లికోర్కె తీర్చడమే, నావిధి! సంఘ మే మనుకున్ననుసరే! నాకు ఫరవాలేదు! నాతల్లి సుఖపడడమే నాకుఁ గావాలి! ఈసంఘ ముతోఁగాని, యీలోకులతోఁగాని, నాకు నిమిత్తము లేదు! (అని ప్రక్కకుఁ జూచి) ఇపుడే పోయి నానిశ్చితార్థము నాకొ కటుంగఁజేసి యూరడించెదను (అని నిష్క్రమించును.)

(తెరపడును)

# పదునొకండవరంగము

(సోదెమ్మగారింటిలో సుందరి విచారముగాఁ గూర్చొని యుండును.)

సుం: నాతల్లిదండ్రులు చేతులార చీఁకటిలో నన్నుఁ బడవేసినారు. అయ్యో! అజ్ఞానములోఁబడి, నాతలిదండ్రులను వృథాగా నిందించుచున్నాను! నానుదుట నిట్లు వ్రాసియుండ, పాపము వారేమి చేయఁగలరు? వారిని నిందింపఁగూడదు! ఇంకెవ్వరిని నిందింపఁ గూడదు! నాదురదృష్టమునే, నిందించుకొనవలసియున్నది. పగ వారికైనా వలదుబాబు, ఇటువంటి కాపురము! అత్తవారిల్లు కాదిది, యమలోకము! ఈయింటిలో నత్తయు, మగఁడును, యమదూతలలాగున నన్ను బీడించుకొని తినివేయుచున్నారు! పట్టెతిని వేయడమే కాదు; కొట్టి తిట్టడములతోఁగూడ, హింసించుచున్నారు! ఉద్యోగస్థుఁడో, ఉద్యోగస్థుఁడో యని నాగొంతుకకోసేశారు. (అనుచుండగా సోదెమ్మ ప్రవేశము)

సో: వచ్చేవు, కోడలుపిల్లా! ఏం చేస్తున్నావే? నీ క్షేమైనా భయభక్తులున్నాయా? పెంకెఘటం దొరికింది మాపూర్వజాఫల మేమిటో కాని!

సుం: నే నేమి చేశా నత్తయ్యా?

సో: అత్తయ్య కాదు- అశనమ్మా యని పిలుస్తోందు! నీకు పొగరు, ఎక్కువవుతోంది! రానీ! యీవేళ, మావాఁడిచేత, నీవళ్ళు చిదగా మదగా చింతకాయపచ్చడిలాగ కొట్టిస్తాను.

సుం: నావల్ల తప్పుంటే తప్పకుండా అలాగునఁ గొట్టించు మత్తయ్యగారు! ఇంతకూ, నే నిప్పుడు చేసిన నేర మేమిటి?

సో: (కోపముతో) నీవు చేసిన తప్పు చెప్పనా? ఉద్యోగస్థుఁడు ఇంటికి వచ్చేటప్పటికి భార్య గుమ్మందగ్గర నిలుచుని యెదురునన్నాహాము జరపవద్దటే! (ఇంతలో తిమ్మయ్య వచ్చును.)

తి: ఏమిటమ్మా హడావిడి! అబ్బబ్బా! బయటికి వెళ్ళితే బయటగొడవలు, ఇంటికొస్తే యింట్లో గొడవలు! ఈయుద్యోగస్తుఁ డీగొడవలమధ్య నలిగిపోతున్నాఁడు!

సో: అదేం నాయనా, బయటేమిగొడవ లొచ్చాయిరా! ఈగయ్యాళి మనయింట్లో కాలు పెట్టేక మన కన్ని కష్టాలే గలుగుచున్నాయిరా, నాయనా! చెప్పు, నాయనా, చెప్పు! ఆగొడవ లేమిటో చెప్పవు?

తి: ఆగొడవలు చెపుతానుగాని, ముం దీగొడ వేమిటో చెప్పవు?

సో: ఏమున్నది? రోజూ ఉన్నగొడవే! కొత్త దేమీ లేదు! నీవు, ఉద్యోగస్థుఁడవని, దానికి కొంచమైనా, భయంలేదురా? దిమ్మచెక్కలాగఁ గూర్చుంటుంది! ఏపని చెయ్యదు.

తి: (భార్యవైపుఁ జూచి) ఆదేమిటే అమ్మా! అది నిలుచుంటే కూర్చుం దంటా వేమిటే!

సో: నే నొచ్చి లేవదీసానురా! అదివర కలాగే కూర్చుంది!

తి: అదా సంగతి! [భార్య నుద్దేశించి] నీ కెన్నిసార్లు చెప్పానే! ఇంటి పనులన్నీ, చేసినతరువాత, నీవని నిలుచోవడమేయని, చెప్పలేదూ? అలాగ, యికముందు, చేస్తావా? లేక, దుడ్డుకఱ్ఱ తీయమన్నావా?

సుం: అలాగే చేస్తాను! ఇప్పటికి క్షమించండి.

సో: చావుతెలివితేటలకు లోటు లేదు! చదువు వెలిగించిందికదూ! వెళ్ళవేం ఇంకాను, లోపలికి వెళ్ళి అన్నీ సిద్ధంచేయి, మేము వస్తాము [అని కోడలిని యదమాయించును. సుందరి నిష్క్రమింప] ఏమిటి నాయనా, చెప్పు బయట గొడవ లేమిటో చెప్పవు!

తి: ఏముంది; ఆఫీసరుగారిగొడవే! ఎప్పుడూ, ఉన్నదే! అయినా, అయీవేళ ఎక్కువైనది! ఇంకోకసారి మెడలో "డవాలు" లేకుండ నన్నుఁ జూస్తే యుద్యోగము తీసేస్తారఁట! గొప్పచిక్కే వచ్చిపడింది. అదివేసుకోవడము నాకు సిగ్గుగా నుంది! ఎలా చావను

సుం: అన్నీసిద్ధం చేశాను రండి [అని పిలచును.]

తి: ఏమేవు, మేము చెప్పుకొనే మాటలు, విన్నావా ఏమిటి?

సో: వింటుందిరా అది. వినకపోవడ మేమిటి? దానిచెవులు పాము చెవులు!

సుం: నే నేమీ వినలేదు. మీపాదాలసాక్షి నమ్మండి!

తి: [జాలిగా] పాపం ఏమీ వినలేదఁట అమ్మా! ఎందుకు దాన్ని అయినదానికి, కానిదానికి, ఆరడి పెడతావు?

సో: నేను దాన్ని, ఆరడిపెడుతున్నానా? ఆఖరికి పెళ్ళాము మగఁడు ఏకమైనారా? నేనే, వేరు, అయ్యానా?

తి: లేదమ్మా! నీవు వేరువు కాదు! మొదలువే! నువ్వు, యీప్రపంచములో లేకపోతే, నేనూ ఉండేవాఁడిని కాను! ఎలా ఉండఁగలను జెప్పు? నిజం జెప్పు!

సో: (కోపముతో) సరిలెండి! తగులడండి!! నాకర్మమే, కాలిందిమధ్య మీరిద్దఱు నయోధ్యగానే యున్నారు! [అని రివ్వునఁ బోవును

తి:—సుం: (విచారగ్రస్తులై యామెవెంటఁ బోవుదురు)

(తెరపడును.)

# పంద్రెండవ రంగము

(గౌరీపతిగారిల్లు-గౌరీపతి కూర్చొని యుండును)

గౌ: అన్నపూర్ణ కుత్తరము వ్రాశాను. ఈవేళ వస్తుంది! ఈమార్పుఁ జూచి యెంతో, ఆనందపడుతుంది! కాని, నాకును, "సుమ"కును గలసంబంధము తెలిస్తే, చాలా బాధపడుతుంది. అది సహజమే కదా! అది యలాగునుండగాఁ బావ "ముమను" జూడ్డానికిఁ గూడ తీరికలేక పోవుచున్నది. ఇంచుక భయముగఁగూడ నున్నది. ఆమెతండ్రి యింటికి వచ్చినదిమొదలు, ఏమి యుపద్రవముఁ గలుగునాయని, సర్వదా నామానసముఁ గీడును శంకించుచున్నది. "ఉమ" నేమి దండించుచున్నాఁడో కదా! ఇఁక నాముఖముఁ జూడవలదని బోధించుచున్నాఁడేమో! (అనుచుండగా నన్నపూర్ణ ప్రవేశము.) అన్నపూర్ణనుఁ జూచి, నువ్వే వచ్చావా? అన్నపూర్ణా! నేను రాలేకపోయాను, పనితొందరలలో క్షమించాలి!

అ: తొందరపనులుంటే, యెలాగ వస్తావు బావా! ఈమాత్రానికేనా, క్షమించుట?

గౌ: నీ కెపుడు, నామీఁద కోపమనేది, రా దన్నమాట! నీయట్టి యిల్లాలు దొరకుట నిశ్చయముగా నాపూర్వజన్మసుకృతము!

అ: మనజీవితా లెప్పుడు నానందముగానే యుండాలి. కాని కోపాలు, తాపా లెందుకు? అవునుగాని "యుమ" యింటిలోనే భోజనము చేస్తున్నావా? (యని యడుగగానే గౌరీపతి యించుకఁ దడఁబడి)

గౌ: లేదు! హోటల్లో భోజనముఁ జేస్తున్నాను!

అ: కారణము?

గా: ఏమీ లేదు! ఆమెయింటికి వెళ్ళడానికే దీరిక లేకపోవుచున్నది. పావుకు దగ్గరగా నొక పాలఘాటుబ్రాహ్మణులహోటల ఉన్నది. అందులో భోజనము చేస్తున్నాను బ్రస్తుతము. నీకొరకు చీరలు, చిన్నచిన్నవస్తువులు, చాలా కొనియుంచాను, జూపిస్తా నుండు (అని లోపలికిఁ బోవును)

అ: మాకష్టా లీనాఁటికి గట్టెక్కాయి, ఓయి సర్వేశ్వరా? నీ వెంతటి దయార్ద్రహృదయుఁడవు!

గా: ఇవిగో: అన్నపూర్ణా (అని లోలకులు, ఒకచిన్నగొలుసు, రెండు జతల గాజులుఁ జేతి కిచ్చును. అవి యన్నపూర్ణ పెట్టుకొనును.)

అన్నపూర్ణ-గౌరీవతి

హే-ధాతా-హే-ధాతా
ఎది-ప్రాప్తమొ-యేవేళన్॥
ఎది ప్రాప్తమొ-యేవేళన్-ధృతిగనదు ప్రజానీకం॥
ధాతా-ధాతా-ఆశాలతా భవవ్రాతా॥
నీవ్రాత-యమోఘంబే। సుఖపడగ ప్రజానీకం ॥ఎది॥

అ: సాదరత నహో ధాతా-సౌఖ్యంబు ప్రసాదించి
పాలింపవో నీధాత్రి-నిగమాధార కృపాచంద్రా ॥సుఖ॥

గా: విధివ్రాతతోఁ-దూలంగా-
సుఖవార్ధిలోఁ-దేలంగా-
హే-ధాతా-నీకృపతో-గనుమా మమ్ము దయాసాంద్రా॥ఎది॥

అ-గా: వేలుదువు-కదా-ధాతా-నీవ్రాత ప్రజానీకం।
భారమొకో మాప్రాణుల్-భరింపంగ కృపాసాంద్రా॥సుఖ॥

(అంతలో బిందె పట్టుకొని నీళ్ళకు సుందరి యచటకు వచ్చును)

: అప్పుడే నే నొచ్చానని నీ కెలా తెలిసింది సుందరీ? ఏమి! కులాసాగా నున్నావా? (పరికించి) అదేమి, యిలాగున్నా వేమిటి?

: అలా నిలబడిపోయా వేమిటి? ఎక్కడో అక్కడ కూర్చో సుందరీ!

ం: ఏమి కూర్చోవడము? (అన్నపూర్ణ నుద్దేశించి) ఏమిబ్రతుకత్తయ్యా! కేవలము యమలోకములాగ నున్నది నాయత్తవారిల్లు. ఇంటెఁడు చాకరీ చేసినతరువాత, నాయుద్యోగస్థుఁడు భర్తగారు వచ్చేవరకూ, నిలుచొని యుండాలఁట! అసలుఁ గూర్చొనఁ గూడ దఁట. (అని కంటఁ దడిపెట్టును. అన్నపూర్ణ సుందరిని చెంతఁ జేర్చుకొని)

ర్ణ: ఊరుకో సుందరీ! కంటఁ దడిపెట్టవలదు! నిన్ను జూచిన నా మనస్సు నీరయి పోవుచున్నది. పెండ్లయి యింకనూ, మూఁడు మాసములుఁ గాలేదు. ఇంతలో నీ కిన్ని కష్టాలుఁ గలిగాయా తల్లీ! ఎంత దురదృష్టవంతురాలవు?

: ఏడువకు సుందరీ! మీనాన్నకు నే నుత్తరము వ్రాస్తాను. అతను వచ్చి నిన్నుఁ దీసుకొని వెళతాఁడు లే! వీళ్ళకు నీవు దొరకడమే వాళ్ళదృష్ట మనుకోక, యేడ్పించుకొని తినడముకూడానా? బాగున్నది?

: వాళ్ళనాన్న కుత్తరము వ్రాసి పిలిపించండి, లేకపోతే సుందరి విచారముఁ జూడలేము! (సుందరివైపుఁ జూచి) ఉత్తర మీవేళే వ్రాస్తారులే, అమ్మా, ఊరుకో! (గౌరీపతివైపు చూచి) ఉత్తర మీవేళే వ్రాయండి. అర్జంటుగా బయలుదేరి వచ్చెయ్యమనండి.

సుం: మీకుఁ బుణ్యముంటుంది త్వరగా నాతల్లిదండ్రులలోఁజేర్పించు బాబు! మానాన్నగారు వచ్చేలోపలఁ బోనిమ్ము మీయింటికి వచ్చేద్దామంటే యీ అపవాదు మీమీఁద పడుతుం దేమో నని భయముంది.

అ: పడితే, భరిస్తాము; నీవు పరాయిదానవా?

గా: బాగా చెప్పావన్నపూర్ణా!

సుం: వద్దత్తయ్యా! కాపురము విడదీశా రన్నవాడుక మీనెత్తిమీఁద పెట్టడము నా కిష్టము లేదు! అది నాతలిదండ్రులకుఁ దప్పదు.

అ: సుందరియెంత దూరాలోచనముఁ గలదో కనిపెట్టారా?

గా: ఎన్నియుంటే నేమి, ఆబంటో్రితుముం దవి రాణించవద్దు?

అ: బాగా చెప్పారు!

సుం: (గారీపతి నుద్దేశించి) మామయ్యా! మీ రాలస్యముఁ జేస్తే, నన్ను, అత్తయ్య నువ్వుకాని, అమ్మా నాన్నఁగాని, చూడలేరు! నే నింక వారిబాధలు భరింపలేను. ఏనూతిలోనో, గోతిలోనో, పడిచస్తాను!

అ: అ దేమే, సుందరీ అలాగంటావు? ఎవరు, ఎక్కడా, దిక్కులేనట్లు మాటాడుచున్నావు! ఇన్నాళ్ళు పెంచినవా ళ్ళిపుడు పెంచుకో లేరు? నువంటే పంచప్రాణాలుగదా!

గా: నీ కేమి సుందరీ! "తరుడుఘారమ్ము" ప్యాసైనావు! ఏపంతులమ్మ పనియైనా చేసుకుంటావు. భర్తయే పోషించా లన్నమాట టక్కర లేదు. స్వశక్తిచే బ్రితకగలవు! అలాగ మనసు పాడుచేసుకోనకు! నేను వెంటనే యుత్తరము వ్రాస్తాను మీనాన్నకు!

అ: మామయ్య చెప్పినమాటలు వింటున్నావా లేదా? కనక, బెంగ పెట్టుకోనకుము! చాలాసేపయినది వచ్చి, మళ్ళి ఏమయినా అంటా రేమో, వెళ్ళు తల్లీ!

సు: వెళతా నత్తయ్యా! తొందరగా వెళ్లితేమాత్రము తప్పౌతా యను కున్నావా, చీవాట్లు?

గా: తప్పే కనఁబడా లేమిటి చీవాట్లు పెట్టుటకు? పిల్లిమీఁద నెలుక మీఁద పెట్టికూడా, తిడతారు కొందఱు! అన్నపూర్ణా! సుందరి యత్తవారు తప్పిపుట్టారు మనుష్యులలో! వానరులలోఁ బుట్ట వలసింది!

సుం: వారిపేర్లుకూడా నవేకదా! మామయ్యా!! (అని నవ్వి) వెళతా నత్తయ్యా! (అని వెళ్ళును)

అ: వెళ్లమ్మా! (అని సుందరినిఁ బంపి ఈచిన్న వయస్సులో, నప్పుడే యెన్నికష్టా లనుభవిస్తున్నదో, పాపము సుందరి! వెంటనే వాళ్ళ నాన్నకు, మీ రుత్తరము వ్రాయండి!

గా: ఈవేళనే వ్రాస్తాను. రా, లోపలికి వెళదాము (అని వెళ్ళిపోవుదురు)

(తెరపడును)

# స్త్రీత్యాగము

## పంచమాంకము

### పదమూడవ రంగము

(సోదెమ్మగారిల్లు-సోదెమ్మ కూర్చుని యుండగా తిమ్మయ్య పరుగు పరుగున వచ్చి)

తి: అమ్మా! ఎక్కడున్నావే? కనబడవేమే? ఊడింది! ఊడింది!! ఉద్యోగ మూడింది!! కొంపదీసి నాపెళ్ళాము గాని వినడము లేదు కదా! (అని కంగారు పడుచుండును)

సో: (కొడుకుదగ్గరగా వచ్చి) లేదురా నాయనా! అది పెరటిలో ఉంది-బావిదగ్గర నీళ్ళు తోడుతోంది, కాని, నువ్వు, అంతకంగారు పడుచున్నావేం, ఏం జరిగిం దేమిటి?

తి: నిజముగా, నాపెళ్ళాము వినలేదుకదా?

సో: బాగుంది! వెఱ్ఱి కుదిరింది రోకలి తలకుచుట్టమ న్నట్లుంది! అది, ఇక్కడ లేదు చెప్పరా! ఇపుడే దానిబుఱ్ఱ చిదగ కొట్టాను. పొరుగింటికి పైత్తనాలకు వెళ్ళి యక్కడే యుండిపోయిందని!

తి: మంచిపని చేసావు! ఇంక నాసోద చెపతా వినవే, అమ్మా! ఈవాళతో పీడ విరగడయిపోయింది!

సో: మళ్ళీ కొప్పడ్డారేమిటి ఆఫీసరుగారు? మంచిగొడవ వచ్చిపడిందిరా నీకు!

తి: ఈవేళతో గొడవ వదిలిపోయింది!

సో: అ దేమిటిరా?

తి: ఏముంది? పోయింది! ఉద్యోగము, ఊడిపోయింది!! "పోయిన మగఁడు పోతే పోయాఁడు, పొన్నకాయలాగ నుండుంది" (అని పాడుచుండును)

సో: ఎలాగ పోయిందో అసలుసంగ తేమిటో చెప్పవురా, నాయనా? అదికాక, ఉద్యోగముఃపోతే, పాటలు పాడటా వేమిటిరా? నీకు విచారము లేదురా తండ్రీ!

తి: ఎలాగ పోయిందా! చెప్తాను సాంతముగా విను! "ఏక్చి ఫల మేమిరా, యూరటం జెఁదుమిరా" అన్నారు- ఒకకవిగారు- కనక అలాగ చేస్తున్నాను.

సో: ఏడిసినట్టుండ- నీగొడవ చెప్పు!

తి: కూలీలలో నొక ఆడమనిషిచెయ్యి పట్టుకొని లాగేనని, ఉద్యోగము తీసేశారు!

సో: (నోరు నొక్కుకొని) అయ్యో! అయ్యో! అదేమికర్మమురా! రంభలాంటి పెళ్ళాన్ని యింట్లో పెట్టుకొని కూలిదానితోఁగూడద మేమి కర్మమురా?

తి: ఏం జెయ్యమన్నావు? చావ మన్నావా? పెళ్ళయి మూఁడునెలలు దాటింది! ఒకనాఁడైనా నాతో ముచ్చటగా నుండలేదు నా పెళ్ళాము! ఎడమొగము- పెడమొగము! ఇలాగ పిలిస్తే అలాగ వెళ్ళుతుంది! ముందు కెళితే కరుస్తుం దన్నభయము- వెనకకు వెళితే తన్నుతుం దేమో నన్నభయము! దాన్ని ముట్టుకోవడానికి నాకు భయము వేస్తోంది! ఎన్నాళ్ళు, ఓరిమిపట్టను వదుచువాణ్ణి! నాకు పెళ్ళామువద్దూ? ఓపిక పట్టేను! పట్టేను! ఇఁక పట్టలేక పోయాను! ఒక అందముగానున్న కూలిమనిషిచెయ్యి పట్టుకొని

లాగేశాను. నాయుద్యోగము పీకేశారు! "గుడ్డిలో మెల్ల! అమ్మా! దెబ్బలు తినకుండా యింటి కొచ్చాను. ఆఫీసరుగా ధర్మమా అని, ఆయన కొట్ట నిచ్చారు కాదు- కూలీలుకొట్టడాని కొశారు!

సో: మనతరిద్రిగొట్టు సుందరి యింట్లో కాలుపెట్టాక మన కష్టా కష్టాలే వస్తున్నాయిరా! సరేలే, త్వరలో నీ వింకొక ఉద్యోగము చూచుకో! నీ వన్నట్లు యిది పోయిందని యేడిస్తే లాభమేమిటి ఇంకొకటి వెంటనే చూచుకోవాలి కాని!

తి: అలాగే చూచుకుంటానుగాని ముందు దా న్నిలా పంపించు అమ్మా!

సో: ఏమేవు కోడలుపిల్లా, ఇలారా! నాకొడుకు పిలుస్తున్నాఁడు! (అని పిలచి కోడలు వచ్చినతరువాత, తాను వెళ్ళిపోవును.)

తి: (సుందరినిఁ జూచి) ఇలాగచూడు- నిన్నే! ఈవేళ, వళ్ళు నొప్పు లుగా నుంది, కొంచెము పట్టాలి నువ్వు.

సుం: ఏమిటి, నీకు వళ్ళు నొప్పులుగా నుందా? కూలివాళ్ళు తన్నడా నికి వస్తే పరిగెట్టావా పాపము? (అని నవ్వును) నాకు వళ్ళు పట్ట డము తెలియదు! నీవు ముందు పట్టి చూపించు.

తి: (కోపముగా) ఆఁ ఏమిటా పొగరు? నన్ను "నువ్వు, నువ్వు" అని సంబోధిస్తున్నావు! నీవళ్ళు పట్ట మంటున్నావా? ఉండు, మా అ మ్మను, పిలుస్తాను!

సుం: నీకుఁ జేతకాక, మీయమ్మను బిలుస్తావా! పిలు! మీయమ్మ వస్తే భయము లేదు!

తి: చేతఁగాక కాదు! నాకు సాయంగా నుంటుందని! సరే పిలువనులే పడతావా వళ్ళు?

సుం: పట్టడం జేతఁగాదని చెప్పానా?

తి: పోనీ, ఏట్టువద్దు లే! మరి (గుని యుచు) మరి, పెళ్ళయి మూఁడు నెలల పదిహేనురోజు లయినదికదా, ఇంకా నన్నుఁ జూస్తే, సిగ్గేనా నీకు? ఈపాటికి పాతపడలేదూ?

తిమ్మయ్య - సుందరి.

తి: నా-తేనీసోనా - సుందరీ
 మూఁడుమాసా - లైనదే ॥నా॥
సుం: ఛీ-నీకర్మంఅంతే - నీరూపుకి
 నేనే - భార్యనా
 కొండముచ్చా - తిమ్మయా॥
తి: నా-తేనీసోనా - సుందరీ।
 మూఁడుమాసా - లైనదే॥
సుం॥ ఓ-కాణాచీ - మగవాఁడా।
 నతిసుఖము - గనవు - గనావూ
 ఇది - నిజము నిజము విను।
 వృధాలాపమే । సుదతిని । పొందంగా।
తి: నను । దయతో । చూఁడవే ॥నా॥

సుం: (పకపక నవ్వి) ఈక్రోతిముఖాన్ని చూస్తే, నాకు సిగ్గుకూడాను? పట్టెసిగ్గు కాదు వళ్ళుమంట!
తి: ఆఁ ఆఁ! ఏమిటీ, నేను కోతినా? తన్నేస్తా నుండు! ఏది "డవాలు" (అని జేబుతడుముకొని) కాదు కాదు! కత్తేదీ? ఎక్కడుంది? కనఁబడదేం, నమయానికి!
సుం: ఒక్క క్రోతివే కాదు- కొండముచ్చువికూడాను! లాక్కున్నాంగా, "డవాలు!" ఈమాత్రం భాగ్యానికే, మహాబుద్ధిశివపడిపోయారు, తల్లీ కొడుకున్నూ?

తి: (కోపముగా వచ్చి భార్యచేయి పట్టుకొని) ఏమిటేవు- పేలుతున్నావు- మళ్ళీ పేలు (అని కొట్టబోగా సుందరి తిమ్మయ్యచేయి పట్టుకొని)

సుం: పేలనా (అని చేయికఱచి వేయుచు) చాలా? (అని నవ్వును)

తి: బాబోయి! బాబోయి!! చచ్చానమ్మోయి! పెళ్ళాము నన్ను కఱచేసిందేవు! ఎక్కడున్నావే, తల్లీ? త్వరగా రావే (అని కేకలు వేయును)

సుం: ఈశాస్తి చాలా? లేక లెంపకాయలుగూడా కావాలా?

తి: వద్దు బాబోయి! నీకు దండం పెడతాను! (లోనికి జూచి) అమ్మా! రావే! లెంపకాయలుం గొడుతుందట! (అనుచుండగా సోదెమ్మ హడావడిగాఁ బ్రవేసించును. సోదెమ్మ రాగానే కొడుకు, ఆమె దగ్గరకు వెళ్ళి, యేడ్చుచుఁ గఱచినచెయ్యి చూపించును. సోదెమ్మ కొడుకుఁజెయ్యిఁజూచి)

సో: అయ్యో! అయ్యో! ఇదేమిటేవు! కుక్కాడిచెయ్యి కఱచేశావు; యెక్కడో, కుక్కలాగున్నావే! మాపాలిటి యమదూతలాగ చ రావే, మాకొంపలోనికి! ఎవఁడినో మరగి, వీడిని, చంపడాని చూస్తున్నావటే!

సుం: నోరు కొంచెము సంబాళించుకొని మాటాడు! నీమాటలుం పడ వా రెవ్వరూ లే రిక్కడ? పరాయివాళ్ళబిడ్డకదా, మనయిష్టము వచ్చినట్లు మాటాడుదా మనుకుంటున్నావా? నేనుపడను! ఇన్నాళ్ల పడ్డాను! ఇక ముందు పడవలసిన యవసరము లేదు! ఉద్యోగమో, ఉద్యోగము యని, నా గొంతుక కోసేశారు [illegible] కుటుంబవేయపురుగులు, ఎప్పుడు నశిస్తారో, తెలియదు (అను చుండగా సోదెమ్మ కఱ్ఱ పట్టుకొని వచ్చి)

సో: ఏమిటేవు పేలుచున్నావు? మళ్ళీ [illegible]

: ఇప్పుడు పేర్లు, తెలుస్తుంది! (అని తల్లివెనుకను వెళ్ళి దాగుండును) ఇంతలో భీమశంకరశాస్త్రిగారు వచ్చి వీరినిఁ జూచి)

: మీ కిది ధర్మముగా నుందా? నాకూఁతురుని, యిలాగ, చంపేస్తున్నారా? మీరు మనుష్యులా? లేక, మనుష్యరూపములో నున్న రాక్షసులా? (అని మందలించుచుఁ గొమరితనుఁ దగ్గరకుఁ దీసుకొని) వెఱ్ఱితల్లీ! నీ వెంతో సుఖపడతావని యిచ్చాను. ఇన్ని బాధలు పడతావని యనుకోనలేదు! నాకడుపు నాకు భారము కాదు- పద తల్లీ! ఈయింటిలో నొక్కనిముష ముండవలదు. ఈ రాక్షసులమధ్య నీవు కాపురము చేయలేవు తల్లీ.

: ఏమిటా స్వాతంత్ర్యం! కోడలినీరాఁద! మాపిల్లని మేము కొడతాము! తిడతాము! పెడతాము!

: మాఅమ్మకుఁ గోడలు- నాకు పెళ్ళామున్నూ- మాయిష్టము వచ్చినట్లు చేసుకుంటాము మీ కేం?

: ఇంకఁజాలు! కట్టిపెట్టండి! మీతిమ్మన్న తెలివితేటలు! పద తల్లీ! వీళ్ళముఖ మింక, ఒక్కక్షణం చూడకూడదు!

ం: ఉండు నాన్నా! నాబట్టలు (దెచ్చుకుంటానుఅని బట్టలుఁ దెచ్చుకొని వారు వెళ్ళి పోవుచుండగా సోదెమ్మ తిమ్మయ్యలు సుందరి చెయ్యి పట్టుకొని)

గ: ఎక్కడకు వెళతావు? నీమొగుణ్ణి వదలి వెళ్ళడానికి వల్లకాదు!

ః: ఏలాగ వెళతావో వెళ్ళు (అని భార్యచెయ్యి పట్టుకొనును)

సుం: (గట్టిగ్గాఁజేసి)ఒదుల్తావా, వదలవా? వళ్ళు గవ్వల్లాగ రాలాలా! (అని చేయి వదలించుకొని లెంపకాయ కొట్టి తండ్రితోఁబోవును. తరువాత తల్లీకొడుకులు, ఏడ్చుచుందురు.)

సో: అయ్యో! నాయనా, ఉద్యోగము పోయింది. పెళ్ళాముపోయింది!

తి: ఇంక మిగిలిం దేమిటమ్మా! వేఁడివేఁడి లెంపకాయ! చెంబు తెల్లగాఁ దోమి యతిపాత్రకుఁ బయలుదేరాలి, తేఁపటినుండి! కాని, భగవంతుఁ డున్నాఁడు!

సో: ఆఁ! భగవంతుఁ డన్నము పెడతాఁడురా!

తి: ఎలాగ పెట్టఁడో చూస్తాను కాదు నేను?

సో: పడికావులే!

(తెరపడును)

---

## పదునాల్గవరంగము

(గిరిజావధానులుగారిల్లు - "ఉమ" విచారగ్రస్తురాలై యుండును. ఇంతలో గిరిజావధానిగారు దగ్గరకు వచ్చి గెడ్డముఁ బట్టుకొని బ్రతిమాలుచు)

గి: తల్లీ! "ఉమా" నీవిలాగ విచారిస్తూంటే, నా కేమి తోస్తుంది? నువ్విలాగ మంచంపట్టి కృశిస్తూంటే, నేను బ్రతకఁగలనా, తల్లీ? నీయుద్దేశ్య మేమిటో చెప్పవు? నీవు బెంగ పెట్టుకొని బొత్తిగా నీరసించి పోతున్నావు! నీముఖబింబముఁ జూచుకొనికదా నేను బ్రతికియున్నాను. లేకపోతే నా కీసంసార మెందుకు?

ఉ: నేను బ్రతికే దెందుకు నాన్నా? బ్రతికియున్నను జచ్చినదానితో సమముకదా? పూర్తిగాఁ బందొమ్మిదేండ్లప్రాయము రాలేదు. ఈలోపున నిన్ని విచారా లేమిటి నాన్నా? పతి లేనిసతిజీవితము, అడవినిఁ గాచిన వెన్నెలతోఁ దుల్యము! ముక్కుపచ్చ లారని

పసితనములో నేదో బొమ్మలపెండ్లి చేసి మీబాధ్యత మీరు వద ల్చుకున్నారు. (అని కండ్లనీరు నింపుకొనును)

గి: నీమాటలు వింటూంటే నాహృదయము మంచువలె కఱఁగిపోవు చున్నది! ఇప్పుడు నేనుఁ జేయఁదగ్గ దేమైనా యుంటే చెప్పు. తప్పక చేస్తాను. లోకు లేమనుకున్నా నాకు భయము లేదు. నీవు సుఖముగా నుంటేనే, నాకు మనశ్శాంతి కలుగును. చెప్పు తల్లీ, చెప్పు (అని కూఁతురుని బుజ్జగించును)

ఉ: (సంతోషము తో లేచి) నిజమేనా నాన్నా? నిజముగ నలాగ చేస్తావా? (అని యడుగును)

గి: నిజమే తల్లీ! నీతో నసత్యము పలికితే, నన్ను నేను ద్రోహము చేసుకొన్న ట్లగును!

ఉ: (కొంచె మాలోచించి) గౌరీపతినిగురించి నీయభిప్రాయ మేమిటి! మంచివాఁడనా? చెడ్డవాఁడనా?

గి: ఏమి యెందుకు మంచివాఁడు కాఁడు? చాలా మంచివాఁడు! ఏమి యెందు కలా గడుగుచున్నావు?

ఉ: అతనిని! (అని యూరకుండును)

గి: అతనిని...? అతనికి భార్య యున్నది కాదా? ఆమె చాలా యు త్తమురాలు! ఆమెకు ద్రోహము చేసినట్లు కాదు, తల్లీ!

ఉ: ఆమె చాలా ఉత్తమురాలు కావుననే, నాప్రేమ కానకట్టగా నిల వదు! తప్పక వప్పుకొఁటుంది !!

గి: వప్పుకుంటేమాత్రము నీకు సవతిపోరొకటా, తల్లీ!

ఉ: ఫరవాలేదు నాన్నా! ఎలాగునో యొకలాగు సరిపెట్టుకొఁటాము! నామన స్సతనిమీఁదనే, లగ్నమై యున్నది! వాస్తవముగా, నీవు నాశ్రేయస్సుఁ గోరిన తండ్రివైతే, వానికే నన్నుఁ బెండ్లిచెయ్యి!

గి: నీమాటకు నే నెప్పు డడ్డు చెప్పాను. ఈవిషయము నీవే బాగా ఆలోచించుకొనవలెను. ఆనక, నన్ను నిందించిన ప్రయోజనము లేదు!

ఉ: బాగుగా నాలోచించుకొనియే చెప్పాను నాన్నా! దీనినిఁగూర్చి నీ వేమీ శంక పెట్టుకొనవద్దు!

గి: నిన్ను విడిచిపెట్టి నేను బ్రతకఁగలనా తల్లీ! ఆత డిక్కడనుండి యెక్కడికైనా వెళ్ళిపోతే, నే నెలాగ బ్రతకఁగలను?

ఉ: ఆతఁ డెక్కడకు వెళ్ళిపోఁడు! ఈయూరిలోనేగా, షాపు పెట్టాఁడు! అదీకాక, మనయింట్లోనేగా, బస పెట్టాఁడు!

గి: అతను, ని న్నంగీకరిస్తే, నీతోసహా, నాయావదాస్తికూడా అతనికే దఖలు పరుస్తాను! ఇంకపద తల్లీ! మంచి దెప్పుడో మనసిద్ధాంతిగారికిఁ గబురుచేసి యడుగుతాను! (అని లేచును)

ఉ: సంతోషముతో నీవంటితండ్రు లుంటే యాఁడుపిల్లలబ్రతుకు సార్థక మౌతుంది నాన్నా?

గి: నేనుమాత్రము నీ కెప్పుడు ద్రోహము చేయలేదు తల్లీ! పరమేశ్వరుఁడు నాచేత చేయించాఁడుగాని!

ఉ: అదైనా, నీవు, మనస్ఫూర్తిగాఁ జేసియుండవు! సోదెమ్మలాంటి ఛాందసురాలివలన నీవు నాకు బాల్యములోఁ బెండ్లిఁ జేసియుంటావు! కనుకనే యిప్పుడు నీతప్పుఁ దెలుసుకొని మనస్సు మార్చుకొనఁ గలిగేవు!

గి: నిజ మంతే తల్లీ! రా! (అని లోనికిఁ బోవుదురు)

(తెరపడును)

## ప దు నై ద వ రం గ ము

ప్రదేశము: గృహాంతర్భాగము.

(ప్రవేశము: సీతమ్మ-అవతారము)

అ: అమ్మా! అమ్మా!! ఈవేళ "త్యాగయ్య" సినీమాకి తీసికెళ్ళవే, అమ్మా?

సీ: ఒకళ్ళింక, నిన్ను, తీసుకొని వెళ్ళడ మేమిటిరా? నీయంతటివాఁడవు ను వ్వయ్యావు? ఇంక నువ్వే పది మందిని, తీసుకు వెళ్ళాలి!

అ: ఎలాగే అమ్మా? డబ్బులు లేవు! డబ్బివ్వకుండా, ఎవళ్ళు సినీమాలకి రా నిస్తారు?

సీ: రాఘవమ్మగారికొడుకు వీరాస్వామిని చూడు, యింట్లో డబ్బు లడగకుండా, వాఁడంతట వాఁడు ప్రతిరోజు, సినీమా చూచి వస్తాడు! మరి, ఎలాగ చూస్తున్నాఁడో కాని!

అ: వాఁడు "యఫ్. యస్." "F. S." గా చూస్తున్నాఁడే అమ్మా!

సీ: అలాగే నువ్వూ, అలాంటి దొకటి చూసుకొని ఎందుకు వెళ్ళకూడదు నాయనా?

అ: పీవు విమానమువెూ తయిపోతుంది నే వెళితే! వీరాస్వామికంటె సినీమావాళ్ళంతా స్నేహితులే! వాళ్ళు అన్నిసినీమాలకు, ఊరికే రా నిస్తా రతన్ని!

సీ: వాడి ముఖవర్చస్సు మారుతుంది. నీ ముఖవర్చస్సేమి, ఇలాగ ఉంది?

అ: నాముఖం బాగుండ దమ్మా? నిజంగా, చెప్పు నీముఖం బాగుంటుందా? నాముఖం బాగుంటుందా?

సీ: "తల్లికి వట్టరా వసంతము. పిల్లికి, పెట్టరా పంగనామాలు"
అన్నట్టు లున్నవి నీమాటలు? నాతో, పరాశకాలేమిటిరా నీకు?

అ: లేదమ్మా! ఏ మనకోకు! ఒక్క ఆరణాలు పారెయ్యి! అర్ధణా నాదగ్గరుంది! ఫస్టుషోకి (First Show) వెళ్ళిపోతాను త్వరగా!

సీ: ఆ, ఆరణాలు, పెడితే వీశెడు వంకాయ లొస్తాయి, కమ్మగా కూర వండుకొని తినవచ్చును!

అ: వంకాయకూర ఎప్పుడైనా తినవచ్చును! "త్యాగయ్య" మళ్ళీ యెన్నాళ్ళకు వస్తాడో?

సీ: వస్తే, ఒకటో మేలు, రాకపోతే, రెండో మేలు!

అ: నువ్వు, నన్ను, పెంచుకోవడానికి ముందు, ప్రతిరోజూ సినీమాకి పంపిస్తాననిరూపాయన్నరస్టాంపుమీఁదవ్రాసిచ్చావు, ఎఱుగుదువా!

సీ: ప్రతిరోజూ అని వ్రాసిచ్చానా? ఆటమార్చినపుడు పంపిస్తానని వ్రాసిచ్చాను!

అ: ఈవేళ ఆటమార్చారు "త్యాగయ్య" ఈవేళనుంచే! అందులో, నాగయ్య, త్యాగయ్య! తెలుసునా మఱి? ఇప్పుడు పంపించు!

సీ: ఒరే! అబ్బాయి! ని న్నెందుకు పెంచుకున్నానో తెలుసురా?

అ: తెలియదు!

సీ: పిడికెడు ముట్టి చేస్తావని!

అ: ఇపుడు చేసెయ్యమన్నా వేమిటి ముట్టి?

సీ: ఎవ్వరైనా నవ్వుతారు రూఁడకో! బ్రతికియుండగా ముట్టి చెయ్య డానికా పెట్టంత కొడుకును కోరి వేఁడి తెచ్చుకుంట? పొరపా టయిపోయింది! ఇపుడే మనుకుంటే, ఏమి లాభము? ఎవఁడైనా, పాలుతాగే పిల్లవాఁడిని పెంచుకోవలసింది!

అ: నేనూ, పాలు తాగేపిల్లవాఁడినే! పట్రా అమ్మా! ఎన్నిసేర్లు తేగ లవో? ఒక్కచుక్క కనబడకుండా "గుటగుట" మని, తాగేస్తాను!

సీ: అఘోరించావు వెళ్ళు! నాపెంపు చాలా సార్థకములోని కొస్తోంది!

అ: ఇలాంటిపెంపు లింతకన్న సార్థకములోనికి రావమ్మా! కడుపునఁ బుట్టాలి! లేకపోతే, యింతే పెట్టిపుట్టాముర దేముఁడా అని, తూర్పుదిక్కుగా తిరిగి దేముఁడికి దండము పెట్టాలి! ఎందుకు? వచ్చేజన్మలో నైనా "నా" కడుపు ఫలించాలని!

సీ: ఒరే! నువ్వు కొడుకువి కావురా!

అ: ఎలాగా కాను!

సీ: మరెందుకు నిన్ను మేపడము?

అ: డబ్బెక్కువ వుండి!

సీ: నాకు డబ్బెక్కువ ఉందా?

అ: లేకపోతే, "యీ పెం పెందుకుఁ గాల్పనేకదా!"

సీ: నాకుఁ దగినవాఁడవునదొరికేవురా, "దొంగతనానికి వెళ్లితే మంగల మెదురైన దన్నట్టుంది" నీపెంపు!

అ: అనవసరపుమాట లాడకు మమ్మరో! కోర్టున కీడ్వఁగలఁడు నీపెంపుడు ప్రియకుమారుఁడు!.

సీ: నన్ను కోర్టు కీడుస్తావా?

అ: గీ. ఈడ్చు టొక్కటె కాదు, తల్లీ! త్వదీయ
ఇనుపపెట్టెల తాళముల్-మొగుర గొట్టి
లొడ్డు లొసుగులుఁ గొనిపోయి-కోర్టు కెక్కి
కందు సినిమాలఁ బ్రతిరోజు-కనని తల్లీ!

సీ: నాకర్మంయిలా కాలింది చూడండిబాబూ! ఈశ్వరా! ఈశ్వరా! కొసకు, నాబ్రతుకేంత దిక్కుమాలిన దైనది! గర్భవాసమునఁ గన్నకూఁతురుని చేతులారఁ గోల్పోయినాను. కొమరితపై బెంగ బెట్టుకొని భర్తకూడ గతించినాఁడు! నేనుమాత్రము మొండిక

పైని యింకనూ, ఈవృద్ధిపై బ్రతికియున్నాను! అయ్యో! నా కింక దిక్కెవ్వరు, మొక్కెవ్వరు? ఉన్నయాస్తి నంతా, ఎవరినో, పరాయివాఁడినిఁ బెంచి, వాఁడిపాలు చేసితిని! న న్నవరు చేర నిస్తారీపరిస్థితులలో! తనకొమరితకోసము, అష్టకష్టములబడి సంపాదించా రాడబ్బు, మావారు! కూఁతురుకి దక్క నిచ్చానుఁ గాను. నేను దక్కించుకొన్నాను గాను! "కాకులను గొట్టి గ్రద్దలకు వైచినట్లు" చేశాను! నా మేనల్లునిమీఁద నవనిందలు మోపి యింటినుండి వెడలఁ గొట్టించినాను! నేను బుద్ధిపూర్వకముగాఁ జేసిన పాపము లూరికే పోవునా! ఒకవేళ, అన్నపూర్ణ దగ్గరకుఁ జేరిన నామె న న్నాదరించునేమో! లేక నేను జేసిన ద్రోహముఁ గడుపులోఁ బెట్టుకొని చేరనీయ దేమో! ఏది ఎట్లున్ననూ నాబిడ్డ దగ్గరకు నేనుఁ బోయి నాతప్పులు క్షమింపమని వేఁడుకొనకతప్పదు.

(నిష్క్రమించును)

(తెరపడును)

---

## పదునాఱవ రంగము

(గౌరీపతిగారిల్లు-అన్నపూర్ణా గౌరీపతుల ప్రవేశము)

అ: విశేషా లేమిటం డీవేళ?

గా: "బావా" అని పిలవడము మానేశా వేమి టన్నపూర్ణా! "ఏమండీ" అని మన్నిస్తున్నావు?

అ: పెద్దవాళ్ళ మర్యాదముగదా? పెద్దమనిషితరహాగాఁ బిలవాలని!

గా: ఎంత పెద్దవాళ్ళమయినా పిలుపులు మారాలని యెక్కడుంది?

అ: ఎక్కడా లేదు! సరే, బావనే పిలుస్తాను! ఆఁ! బావా, యీవేళ విశేషా లేమిఁటి?

గా: నీవే చెప్పాలి! నువ్వు చెప్తే, నేను వింటాను!

అ: "ఉమ" యీమధ్య జబ్బుపడి లేచినట్లుంది. నిన్నఁటిదాకా, ఈ సుర్లో దేముఁడా అన్నట్లుంది. కాని యీవేళ యెందుచేతనో చాలా యుషారుగా నున్నది. కారణ మేమిటో తెలియదు, మఱి!

గా: అడిగి తెలుసుకోనలేక పోయినావా?

అ: తీరా నేను నోరు తెఱచి యడిగితేమాత్రము నాకుఁ జెప్పుతుం దేమిటి? ఆమెకు జబ్బుగా నున్నప్పు డొకసారి చూద్దామని వెళ్లాను, నేను మాటాడడమేకాని, యామె మాటాడలేదు. నాప్రశ్నల కేడుపుతోనే సమాధానముఁ జెప్పినది! ఏమిటో, రెండు మూఁడుసార్లామాటలలోనే, "నాకర్మ యిలా కాలిం దక్కయ్యా!" అని యన్నది, దానిభావ మేమిటో?

గా: (నవ్వుచు) మంచివరనే పెట్టినది!

అ: ఏమి యక్కయ్యంటే తప్పా? అదేమిటో కాని యామెనుఁ జూస్తే చాలా జాలి కలుగుతుంది గుండె నీరై పోతూంది! ఎంతజాలి కలిగితేమాత్రము మన మేమి యుపకారముఁ జేయఁగలము, ఆమె విచారకారణ మేమిటో తెలియ నప్పుడు!

గి: నీవు చేయఁగలిగిన దేదైనా యుంటే చేస్తావా, అన్నపూర్ణా?

అ: తప్పకుండా చేస్తాను, పాప "యుమ" మన కెన్ని యుపకారాలు చేసింది మనదరిద్రావస్థలో?

గా: నీవు చేయఁబోయేది సామాన్యోపకారము కాదేమో, బాగుగా నాలోచించుకో

అ: ఆయుపకార మెట్టిదైనాసరే, యామెకొఱకుఁ జేసి తీర్తాను.

గౌ: నిజమేనా యన్నపూర్ణా! లేక, యుద్రేకముతో మాటాడు చున్నావా?

అ: నిజమే, నానోటికి రెండు నాలుకలు లేవు. ఉద్రేక మంతకన్నా లేదు.

గౌ: (నిదానించి) నీభర్త నామె ప్రేమిస్తే?

అ: తప్పేమిటి? నే నెలాగ నిన్ను ప్రేమించానో, ఆమెకూడా అలాగ ప్రేమిస్తుంది. ప్రేమాస్పదమైన యొకవస్తువు నెందఱో ప్రేమింప వచ్చును. నీప్రేమామృతము నే నొక్కతెనే గ్రోలాలని యెక్కడుంది? నీభర్త లందఱికిని బంచిపెట్టవచ్చును. ఇంతకూ, నీయానందము, నాయానందము కాదా? నీయాజ్ఞ నెల్లప్పుడూ, నేను శిరసా వహించెదనని, నీకు దెలియదా? "ఉమ" మనలను గష్టకాలములో గాపాడింది! అలాంటియామె మన కాపద్బాంధవురాలు! నిన్ను బ్రేమించింవంటే నా కపరిమితానందము కలుగుచున్నది. ఏకారణముచేనైనను, ఆమెమీద నీకంతయిష్టము లేక పోయినా, నాకోరకైనా, నీ వామెను ప్రేమింపవలెను.

గౌ: మనము గాలిలో మేడలు గట్టుచున్నాము మేమో! ఆమె మన యింటికి వస్తుందా అసలు? వట్టిది?

అ: వట్టిదైతే ఏమీ యనుకోవలసిన పనిలేదు. నిజమైతే తప్పకుండ నీ వంగీకరింపవలెను. (ఇంతలో నన్నపూర్ణ తల్లి సీతమ్మ వచ్చి)

సీ: ఎవరండమ్మా? ఈయిల్లు గౌరీపతిగారిదేనా? (అని యడుగును)

గౌ: అవు నెవరికోసము?

సీ: అన్నపూర్ణా, గౌరీపతులకోసమే! ఆగౌరీపతిగారిభార్య అన్నపూర్ణ నాకూతురే!

గౌ: (ఆశ్చర్యముగా జూచి) అత్తయ్యా! నిన్ను బోల్చుకోన లేక పోయాను! ఏమిటి, యిలాగై పోయావు? రా లోపలికిరా! (అన్న

గౌ పూర్ణ వైపుకుఁ దిరిగి) అన్నపూర్ణా! అలాగ చూస్తా వేమిటి?
అ: మీయమ్మను లోనికిఁ దీసుకొనిరా (అని చెప్ప నన్నపూర్ణ తల్లి దగ్గరకు వెళ్ళుచుండగాఁ దల్లి వచ్చి కూఁతురు నాలింగనముఁ
గ జేసుకొని)

అ: అయ్యో! నాతల్లీ! ని న్నెంత యన్యాయము చేసానమ్మా! నీతండ్రి నీకోస మష్టకష్టాలుఁబడి సంపాదించినడబ్బు దారినిఁబోయేవానికి ధారఁబోశాను! ఆఖరికి, నీకాళ్ళదగ్గరకు వస్తేకాని, నాకు
గ మోతము లేకపోయినది! (అని యేడ్చును)

అగౌ: అలాగు ననవల దత్తయ్యా! ఎవరిసొ మ్మెవరికి ఋణమొ, యెవరు చెప్పఁగలరు? ఋణము లేక తృణము దక్క దందురు పెద్దలు!

నే: నీ వెంత యుదారస్వభావుఁడవు నాయనా? ని న్నెంత కష్టాలు పెట్టాను! అన్నపూర్ణా! నాఁదప్పులు సైరింపవలెను తల్లీ (అని చేతులు పట్టుకొనును)

గౌ: ఎందు కమ్మా అలా విచారపడతావు? ఏవిషయములోను మన యత్న మే మున్నది? అంతా యీశ్వరేచ్ఛ! అతనియానతిప్రకారము మన మెల్లరము సంచరింపవలసినవార మేకదా! పోనీ! యిప్పటికైనను గలుసుకొన్నా మంతియే చాలును! (అనుచుండగా "ఉమా గిరిజావధానులుఁ" బ్రవేశముఁ జూచి అన్నపూర్ణాగౌరీపతులు, ఆశ్చర్యపడుచుండగా)

ఉ: నాయనా! గౌరీపతి! నీ వాశ్చర్యపడవలదు! తల్లీ, అన్నపూర్ణా! నీవు నాబిడ్డనుగురించి యుదారగుణముఁ జూపింపవలెను! మీ రుభయులుఁ గలసి యొక యనాథబాలిక నుద్ధరించాలి! (గౌరీపతి మాట లాడకుండ నన్నపూర్ణ వైపుఁ జూచుచుండును. అది యన్నపూర్ణ కనిపెట్టి)

అ: పెద్దలు! మీ రలా యనవలదు. మీరు మాకు బరమ పూజ్యులు మీకుఁ దెలిసియోఁ దెలుపకుండనో, మీకొమరిత మాకుఁ జేసిన మేళ్ళు, మే మీ, జన్మములో మఱచిపోలేము! మీరు చెప్పవలసినది తప్పక చెప్పండి! మాకు సాధ్యమైన కార్య మేదైనను, మేముఁ దప్పకఁ జేసెదము!

గి: చేసెదవా తల్లీ! నిశ్చయముగఁ జేసెదవా? నాయొట్టి తల్లి "యుమ"ను నీసోదరిగాఁ జేసుకొని నీభర్తపాదముపద్మములసేవలో నొక భాగ మీయవలెను!

అ: ఇంక మీరు వేరుగఁ జెప్పనక్కరలేదు! ఆమె సుఖించుచుండడమే మాకు సంతోషము! "ఉమ" నాప్రియసోదరి! నాప్రేమలో నాకూర్మిసోదరికి అర్ధభాగ మిచ్చెదను! (అని "యుమ" చేయి పట్టుకొని దగ్గరకుఁదీసి) "ఉమా!" నాదగ్గర నీవింకభయపడ నవసరములేదు! ఇంతటినుండి మనమిద్దర మక్కసెల్లెండ్రము! నిన్నుఁ జూచినప్పుడెల్ల నాకు విచారముగా నుండేది. ఈనాఁటితో, ఆవిచారముతొలగిపోయినది!

గి: అన్నపూర్ణా! నీవు నిజముగఁ గాశీయన్నపూర్ణతల్లివే! ప్రాయమునకుఁ జిన్నవయస్కురాలవైనను, బుద్ధికి బృహస్పతివంటిదానవు! నీ స్త్రీజన్మము నేటితో సార్థకమయినది. ఈ "స్త్రీత్యాగము"ను బంగారపు టక్కరముల భావిచరిత్రకారులు లిఖింపవలసినదే! ఓత్యాగమూర్తీ! నీకునమస్సాశీర్వాదములివే గ్రహింపుము!

అ: ఇందులో నాత్యాగమేమియు లేదు నాన్నగారు! నిజముగ మీరు త్యాగమూర్తులు. "ఉమ"కు జీవనము పోశారు! ఆమె నిరర్థక జీవితాన్ని నేటినుండి సార్థకముఁ జేసేరు. (అని "యుమా గారి పతుల" హస్తములను గలుపును.)

గౌ: అన్నపూర్ణా! నీవు నాభార్యవు కావు: నాభాగ్య నాకు నీతివిధులఁ గఱపిన మహోపాధ్యాయురాలవు! స్త్రీత్యాగమంటే నీదే! నీవు నిజముగఁ గాశీ యన్నపూర్ణాదేవి కంటెను నెక్కువ దానవే!

అ: నీవు గౌరీపతివి గావా! ఈయన్నపూర్ణకుఁ దగిన భర్తవు!!

సీ: నా యన్నపూర్ణ యింతటి స్వార్థపరత్యాగిని యని నే నన్నఁడను కొనలేదు! ఇట్టి త్యాగమూర్తినిఁ గాంచిన నాగర్భము నేఁటితో పవిత్రమైనది.

గ: గౌరీగంగలఁ జందమున నీ “ఉమా అన్నపూర్ణల” మెఱుఁగుల్ కొని నేఁటినుండి యేలుకొందువు గాక గౌరీపతి!